# సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజి



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస



అమ్మ శారదా దేవి



గురు వివేకానంద



గురు సాయిబాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళ స్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని తెలుగు భక్తి వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ ఫౌండేషన్ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) తెలుగు భక్తి వారి వెబ్ సైట్: www.telugubhakti.com
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో తెలుగు భక్తి వారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

### Scriptures, Slokas and Stotras

Adi Sankaracharya
Aditya
Adwaitam
Ayyappa
Bhagavad Geetha
Bammera Pothana
Bhagavatam
Brahma Sutras
Durga
Dattatreya
Ganesh
Gayatri
Guru
Hanuman
Hindu Marriage System
Krishna
Lakshmi
Mahabharat
Mantrapushpam
Narada Bhakti Sootralu
Nava Grahas
Patanjali Yoga Sootralu
Raghavendra
Rama
Ramayanam
Rama Geeta
Saraswathi
Sandharbha
Satya Sai
Shirdi Sai
Siva
Slokas with meaning
Subrahmanya
Suktas
Sundara Kanda
Venkatesa
Vishnu
Vratas
Upanishads
Rigveda
Samhitaanuvadam
(Yoga Paranga)
Vyasa Bhagavatam

### General

Appeal and Objectives
Bala Basha
Bhakti Celebrities
Bhakti Classicals
Bhakti Links
Book Reviews
Jeji Mamayya Patalu
Chatuvulu
Dasa Mudrani
Divine Guidance of Satya Sai
Kavitha Kadambam
Keerthanalu
Koonalamma Padalu
Prasnalu - Javaabulu
Naturopathy
Rishi Vani
Sai Krishna's Art
Satakalu
Swamiji
Tatvalu
Telugu Special
Useful Links
Value Education
Web Hunt
Hindu Cultural
Questions & Answers
Yoga
Yoga Mudralu Bandhalu
Yogasanas (Detailed)

### Downloads

Audio Downloads
Bhakti Screen Savers
Printer Friendly Page

**Pravachanaalu**

Bhaja Govindam
Bhasmo Dhulita Vigrahaya
Karma Siddhantam
Class Prayers
Kenopanishad
Sri Narasimha Charitram
Soundarya Lahari
Ramana Saranagathi
Vivekachoodamani

**Specials**

Annamayya Pada Visleshana
Monthly
Satsang
Chinna Kathalu
Class Prayers
Human Relations
Nadiche Devudu
Stories of Alwars
Stories of Bhaktas
Stories of Indian Sages
Stories of Nayanars
Sankara Vangmayamu
Special Articles
Hinduism and Mantras
Personality Development

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఙవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

వే॥బ్రా॥శ్రీ వేదాంత సుబ్బయ్యశాస్త్రి విరచిత

# తత్వాలు

## 1 వ తత్వం

1. సతతం భజ సద్గురునాధం సద్గురునాథం గురువరదేవం।
పాపారణ్య  దవానలరూపం శంభుముమాపతి పరమేశం॥
2. సకలసురాసుర భయహర దేవం నిర్మలనిత్య నిరాకారం।
బ్రహ్మేద్యమరే ప్రార్థితవందిత సర్వేశం సురలోకేశం॥
3. సకలచరాచర భువనాధారం వేదవేద్య శివదృగ్రూపం।
ఏకాకారం చిన్మయరూపం పరిపూర్ణం బ్రహ్మానందం॥
4. నిర్మలనిర్గుణ నిత్యనిరంజన చైతన్యం హృదయాకాశం।
సర్వజీవహృదయాంతరవాసం కైలాసం చిత్సుఖదేశం॥
5. జన్మమృత్యు భయరోగ నివారణ పరమేశం గగనాకారం।
జగదాధారం భవభయనాశం మోహవినాశన సర్వేశం॥
6. సర్వసముద్భవ కారణరూపం సర్వేశం విజ్ఞానమయం।
సర్వభక్తజనమానసహ సం శివరూపం పరమానందం॥
7. దేహవిలక్షణ చిన్మయరూపం కైవల్యప్రద గురునాధం।
ద్వంద్వాతీతం పరమగురు మహాదేవం శ్రీ సద్గురునాధం॥

## 2 వ తత్వం

1. శరణు గురుమహాదేవ సర్వేశ్వర సదాశివ శంకరా।
శరణు శ్రీ గురునాధ సర్వాధార శ్రీగురు శంకరా ॥శ॥
2. శరణు నిజసఖరూప నిత్యాఖండరూప మహేశ్వరా।
శరణు మృత్యుంజయ సదాశివస్వామి సద్గురుశంకరా ॥శ॥
3. శరణు పావనమూర్తి పరశివదేవ గురువర శంకరా।
శరణు సద్గురుదేవ విశ్వనియామక ప్రభు శంకరా ॥శ॥

4. శరణు మాయాతీత నిజసాక్షి స్వరూపా శంకరా ।

శరణు త్రిగుణాతీత విశ్వాతీత భేదభయంకరా ॥శ॥

5. శరణు నిరఘ నిరంజనాద్వయ దేవ శ్రీగురు శంకరా ।

శరణు నతజనపాల గురుమహాదేవ సద్గురు శంకరా ॥శ॥

## 3 వ తత్వం

1. శంకరగురుదేవా ॥జయజయ॥ శంకరమహదేవా । ॥శం॥

శంకర నేనీ కింకరుడను యమ । కింకరులొసగెడు బాధమాన్పుము ।

2. చిన్ననాటనుండి దేవా ! నిన్ను వేడుకొంటినిరా ।

ఎన్ని విధంబుల బతిమాలినను । కన్నుదెఱచి ననుజూడవదేల ।శం।

3. దోషముజేసితిరా ।నాపై। రోషముజేయకురా ।

దోషములెల్లను నాశముజేసెడు । ఈశుడె నీవని నమ్మితిదేవా ।శం।

4. మరణభీతిద్రుంచి ।నాలో। దురభిమానమణచి

కరణసాక్షియగుగురుమహాదేవా । శరణుజొచ్చితిని గావుముదేవా ।శం।

## 4 వ తత్వం

శంకరా ఇది ఎంతటిదౌర్భాగ్యమురా । సంకట పరిహార శ్రీసద్గురు ।శం।

1. ఇంటిలోని మృష్టాన్నము వదలుచు ।ఇంటింటికి తాభిక్షము నెత్తెడు ।

శుంఠునిపరి తన నిజసుఖమెరుగక । కంఠశూలమగు కాంతలగోరుట ।శం।

2. తన నిజరూపము తానెఱుగక ఈ । తనువే తానని భావించుచుమది ।

నిను మరచుచు నీ మాయకువశుడై।ధనవనితాదులు సుఖమని తిరుగుట।శం।

3. చచ్చేవారినిజూచుచు తనలో । ఇచ్చ వచ్చినట్లెల్లను మెలగుచు ।

నిశ్చలముగ నీధ్యానముజేయక । చచ్చేటప్పుడు గడగడవణకుట ।శం।

4. ఎన్నటికైనను తానొకనాటికి । అన్నిటివదలుచు చనవలెనని నే ।

నెన్ని విధంబుల బోధించిన ఈ । మనసీ తనువభిమానము వదలదు ।శం।

5. బాల్యంబంతయు ఆటలయందున । స్త్రీలోలుండై యౌవనమందున ।

కాలమంత నే వ్యర్థము పుచ్చితి । కాలుడు వచ్చెను ధ్యానము నిలువదు ।శం।

6. దేహము వార్థక్యంబును । బొందెను మోహముమాత్రము వదలదు

మాయా। సాహసమెట్టిదో నేనెఱుగను నే। మాయను దాటగ నాతరమా ప్రభూ

।శం।

7. వేదార్థము లెల్లను దెలిసియు నే ! బోధరూపుడై నిలువక నేనీ ।

భేదబుద్ధిచే కని సతిసుతులను, నాది నాదియని యభిమానించుట ।శం।

8. మూడు తనువులను మూడవస్థలను । కూడియుకూడక వెలుగుచు

నుండెడు ! వాడే నేనని దృఢముగనుండక । మూఢుడగుచు బహుచింతలము

నుగుట. ।శం।

9. గురుమహాదేవా నీవేగతియని । పలిపలివిధముల నినువేడితిరా ।

మరణభీతిబోగొట్టుచు నీవే । కరుణతోడ ననుగావుము దేవా ।శం।

## 5 వ తత్వం

1. ఎన్నిదినములనుండి నిను నే వేడుకొంటిని గురువరా ।

నిన్ను మఱచుచు తిరిగిబ్రతికెడు పాడుబ్రతుకివ్వకుమురా ।ఎ।

2. నిన్ననే ధ్యానించకుండిన దేవ అది నాదోషము ।

నన్ను విషయ సముద్రమందున ముంచితే నీ దోషము । ।ఎ।

3. భక్తివైరాగ్యంబు వేడకయున్న అది నాదోషము ।

ముక్తిదాలిని జూపకుండిన నీది కాదా దోషము ? ।ఎ।

4. శిష్టజనులను జేఱకుండిన దేవ అది నా దోషము ।

దుష్టులను తప్పించకుండిన నీదికాదా దోషము ? ।ఎ।

5. నాదుతప్పలనెంచి శిక్షనుజేయు ధీరుడు నీవురా ।

నీదుతప్పలనెంచుధీరుడు లోకమందే లేడురా ।ఎ।

6. నాకు నిజముగ నిన్ను వదలిన వేఱుదిక్కే లేదురా ।

లోకమెల్లను వెదకిజూచిన నీకు ఎదురేలేదురా ।ఎ।

7. ఏమి ఈ అన్యాయమిది నేనెవరితో మొఱలిడుదురా ।

ఈ మహాభవసాగరంబున నన్ను ముంచితివేలరా ? ।ఎ।

8. నీదుమాయనుగెలువ బ్రహ్మాదులకునైనను సాధ్యమా ।

నీదుమాయావలను ననుచిక్కించిచూచుట న్యాయమా ? ।ఎ।

9. చిక్కిమాయకు దుఃఖమున నే నేడ్చుచుండిన హాస్యమా ?

దిక్కుమాలిన వాడ నను విడనాడి చూచుట న్యాయమా ? ।ఎ।

10. వేగవేగమె మ్రింగుచున్నది ఆయువంతయు కాలము ।

భోగబుద్ధిని మానకున్నది పాడుఅంతఃకరణము ।ఎ।

11. ఏమిచేయను తోచకున్నది నినువినా దిక్కెవరురా

హేమహాదేవాధిదేవా, నను సంరక్షించరా । ।ఎ।

## 6 వ తత్వం

గురువేగతియనుమనసా । తత్వ। గురుపాదములకంటె ఘనమేదే మనసా ।గు।

1. మరచుచు నిను తిరిగితివే ।నేను। నరుడని మాంసకాయమునే నమ్మితివే ।

తరుణులపొందు కోరితివే । కోరి । పరిపరియోనుల పుట్టి చచ్చితివే ।గురు।

2 ధనధాన్యబంధు భాగ్యములు ।నీదు । ఘనతనెరుంగని మాయా కార్యములు ।

కొనలేని దుఃఖజాలములు । అందు । మనసుంటే తొలగవు బహుసంకటములు

।గురు।

3. నిను నీవు ఎఱుగుసాహసము ।వదలి । కనుబడుచుండు నీజడదృశ్యచయము।

మననింప నీకేమిఫలము । చూడు । నినునీవు ఎఱిగిన ఆనందమయము ।గురు।

4. ఎరుకది శూన్యము కాదు ।నిత్య । పరమానందమువట్టి మాటలరాదు ।

గురుతేమియం దగుబడదు ।శ్రీస। ద్గురుమహాదేవుడన్యమునీకుగాదు ।గురు।

## 7 వ తత్వం

1. దేవుని నీవు భజించుమురా ।ఇక। నీవు భజించి సుఖించుమురా । భావము

నందున వెలుగుచునుండెడు । దేవుడు నీ నిజగతియని నమ్ముచు ।దే।

2. మోహము నీలో ద్రుంచుమురా । ఆత్మ । ద్రోహము మది నీవెంచకురా ।
సాహసమున వైరాగ్యము జెందుచు । వూహల కందక మనుసున వెలిగెడు. ।దే।

3. కాంతసుఖంబని ఎంచకురా ।అది । ఎంతో సంకటమూలమురా । ఎంత
మాత్ర సుఖమగునదినీ దే । హాంత మందునిను చింతలముంచును ।దే।

4. మాయ సంసారంబిది కనరా । ఈ మాయకుచిక్కి తపించకురా ।
కాయము కేవల మాంసమయంబని । కాయము నమ్మక దేవుని నమ్ముచు ।దే।

5. నిను నీవు వుద్ధరించు కొనవలెరా । మఱి నిను యింకెవరుద్ధరించరురా ।
నినుగెల్చిన నీకు నీవేమిత్రుడు । నిను మరచిన నీకు నీవే శత్రువు ।దే।

6. నరులిక మెచ్చిన యేమగురా । ఆ । పరముని మనసున మరవకురా ।
నరులిక మెచ్చిన మోక్షమునిత్తురె । పరముడు మెచ్చిన మోక్షము నివ్వడే ।దే।

7. బాహ్యమునందున దొరకదురా । హరి । నీ హృదయము నందుండునురా ।
దేహము మరచుచు హరిని భజించిన । శ్రీహరి నీలో వెలుగునురా ।దే।

8 సాకారమునైనను సరియే । ని । రాకారమునైనను సరియే । సాకార నిరాకారం
బులు ఆ । లోకేశ్వరునికి ఆకారములవి ।దే।

9. ఆ మరణము నిను వదలదురా । అపు డేమియు జేయగ తోచదురా ।
ఏమరకుండగ నీమది నిరతము । శ్రీమహాదేవుడె నీసద్గతియని ।దే ।

## 8 వ తత్వం

1. లోపల వెలుపల నిండిన శివునికి ఆవాహన మనునది గలదే ।
ఆ పరమాత్ముడు సర్వాధారుడు అతని కాసనముంగలదే ।లో।

2. నిత్యశుద్ధ పరమాత్మకు పాద్యం బర్ఘ్యంబాచమనముగలదే నిత్యనిర్మలా
ఖండ పరమాత్మకు స్నానంబెం దైనను గలదే ।లో।

3. జగదాధారుండగు పరశివునకు వస్త్రపు పుపచారముగలదే । జగమెల్లను
వ్యాపించియుండు దేవుని కుపవీతంబును గలదే. ।లో।

4. మనసున వాక్కులకందని నిర్వా । సనవరునకు పుష్పములేల ? కని

విషయంబుల నంటక వెలిగెడు । పరమాత్మకు గంధము యేల ।లో॥

5. అక్షయుడగు బహుసుఖ లక్షణునికి । ఈజడ ఆభరణములేల లక్ష్యమునకు
చిక్కని నిజసాక్షికి ఈ బియ్యపు అక్షతలేల ।లో॥

6. నిర్విషయుండై వెలుగు పరాత్మకు । ధూపపు వుపచారముగలదే ।లో॥
సూర్యుని వెలిగించెడు పరమాత్మకు । దీపంబెందైనను గలదే ।లో॥

7. నిత్యతృప్త నిరవయవుండగు పర । బ్రహ్మకు నైవేద్యము గలదే । సత్తుచిత్తు
ఆనందస్వరూపునికి । తాంబూలంబునుం గలదే ।లో॥

8. బోధరూప పరంజ్యోతి స్వరూపునికి । నీరాజనము గలదే । వేదములక
గోచరుడగు వరముని ।స్తుతియించుటకును కాగలదే. ।లో॥

9. ముందు వెనుక ఎందెందుండెడుదే । వునికి ప్రదక్షిణమెట్లగురా । సందులేక
తానిండిన శివునికి । దండప్రణామం బెట్లగురా. ।లో॥

10. అందిందుండుచు నచలుండగు పర । శివునికి వుద్వాసనగలదే । బంధరహిత
సహజానందునికి । పూజల సంబంధము గలదే. ।లో॥

11. జీవుడు వ్యామోహము వదలుచు తన । నిజతత్వము కనుగొనవలెరా ।
జీవుడు తానె మహాదేవుండని । వూరకున్న నిజ పూజగురా ।లో॥

## 9 వ తత్వం

1. ఎన్నటికో । నాకెన్నటికో॥ చిన్మయుడగుచును శాంతమునొందుట ।ఎ।
2. ఎక్కడిబంధువు లెక్కడి మమతలు । ఎక్కడి మోహములెక్కడి దుఃఖము ।ఎ।
3. సతి సుతులను అభిమానము వదలుచు।సతతము నిన్నే చింతించుట నాకు ।ఎ।
4. మనసున వేవిధ విషయము లెల్లను । మననము జేయక నెమ్మది పొందుట ।ఎ।
5. ఎన్ని విధంబుల కర్మల పూజల । నెన్ని జేసినను శాంతియులేదే ।ఎ।
6. దేహము నేనను మోహము వదలుచు।బ్రహ్మమునేనని సుఖముగ నుండుట.।ఎ।
7. వేదాంతార్థము లెన్ని దెలిసినను । నాదియనెడు అభిమానము వదలదు ।ఎ।
8. ఎరుక మరపులను ఎరిగెడు ఎరుకే । గురుమహాదేవుని నిజ రూపంబని ।ఎ।

## 10 వ తత్వం

1. ఎంతటి సాహసమే । మాయా॥ ఎంతటి సాహసమే ॥ అంతింత యనరాని చింతల జిక్కించి । ఎంతటి దుఃఖసాగరమున ముంచితి ।ఎం।
2. దేహ విలక్షణచిన్మయుడగు నాకు ।దేహమె నేనని మోహము జూపితి ।ఎం।
3 తరులను గిరులను సురవరులను జూపి । పరి పరి విధముల మ్రొక్కించి ముంచితి ।ఎం।
4. మర్మము జూపక కర్మలజేయించి । నరక నాకములకు తిరిగించి ముంచితి ।ఎం।
5. భౌతిక దేహమునందున భవభీతి । జాతినీతి భ్రాంతిజూపించి ముంచితి ।ఎం।
6. నీరూపమును జూడ మాయమైపోతివి । నా రూపమును కనలేకుండ మరుగైతి శ్రీం।
7. ముందు వెనుకుండక సందున నగుబడి । సందును దెలిసిన కానక మరుగైతి ।ఎం।
8. పరమాత్మయందున లేనట్టి మరపును । వెరపును జూపించి వెతలను బెట్టితి ।ఎం।
9. గురు మహాదేవుని శరణన్న మాత్రాన । గురుతులేకనె నీవు మాయమై మరుగైతి ।ఎం।

## 11 వ తత్వం

1. గురుసేవ కొనసాగలేదు । ఈ । మరణభీతియు పోనులేదు । కరణధర్మము లెల్ల మీరుచు తాశుద్ధ । ఎఱుకస్వరూపుండై నిల్వలేదు. ।గురు।
2. విన్నతత్వము నిల్వలేదు । ముందిక । విన్నను ఫలమేమి లేదు । చిన్మయుడనుచును తన్నెరుగలేదు । జన్మమరణవారిధిని దాటలేదు ।గురు।
3. కామాదులను వదలలేదు । తానా । భూమానందము బొందరాదు । నామరూపభ్రాంతి తా వదలలేదు । స్వామి సదాశివుడై నిల్వలేదు. ।గురు।

4. నరుడు తాననుట పోలేదు । ఈ । కొరతలు తగ్గుటలేదు । విరతియు
నిలువక కొరతలు తగ్గవు । గురుమహాదేవుని గుట్టెరుగ రాదు ।గురు।

## 12 వ తత్వం

1. నిన్ను పొగడే భాగ్యమొసగుమురా । మహాదేవ నాకు ।నిన్ను।
భిన్నదేహము నేనుకాదని । భిన్నదేహమునందు వెలిగెడు ।
చిన్మయాత్ముడె నేననుచు నా । జన్మసార్థక మొందజేసిన ।నిన్ను ।
2. కన్నులందున జూచువాడెవడు ఈ వీనులందున । అన్ని శబ్దము
లెరుగువాడెవడు । భిన్న భిన్న విషయములెల్లను । తిన్నగా నే నెరుగు
చున్నను । కన్నవిషయము లంటకుండెడు । చిన్మయుడే నేననుచు
దెలిపిన ।నిన్ను।
3. మూడుతనువులు నేనుకాదనుచు । నేననుభవించెడు । మూడవస్థలు
నాకులేవనుచు మూడుమలముల మూడుగుణముల । కూడికూడక
వెల్గుచుండెడు । వాడు నిజసాక్షి స్వరూపుడు । వాడే నేనని బోధ
జేసిన. ।నిన్న।
4. సత్తుచిత్తానందరూపుడని । నిజమెరుగ నేనే। నిత్యనిర్మల శుద్ధ
బుద్ధుడని । తత్వమసి వాక్యార్థ మిదియని । తత్వమును బోధించి
నాకీ మర్త్య భావముబాపి శ్రీపర । మాత్ముడే నే ననుచు దెలిపిన ।నిన్ను।

## 13 వ తత్వం

1. ఎక్కడిభవబంధం । ఇది నీ కెక్కడి సంబంధం । పెక్కువిధంబుల
చిక్కుల జిక్కుచు । చిక్కలేదు నిజముక్తి సుఖంబది ।ఎ।
2. వెంబడితేలేదు । ముందిది । వెంబడిరాబోదు । డంబముతో మలకుం
భము నేనని । సంభ్రమమున నీవుండిన నిలుచునే ।ఎ।
3. దేహము నీదగునా । నీదని మోహించుట తగునా । దేహము నీ తలి
దండ్రులుజేసిరే । దేహము శివునిది నీదెట్లగునురా. ।ఎ।

4. బంధువు లెవ్వరురా॥ ఆయమ ।బంధువు లగుదురురా । బిందువు వీర్యము నందనుడాయెను । బంధువు లెక్కడ యింద్రజాలమిది ।ఎ।

5. కర్మ వదలలేదు । నీ నిజ । మర్మ మెరుగలేదు । కర్మలజేయగ వచ్చిన దేహము । కర్మలచే యిది పోదెన్నటికిని ।ఎ।

6. యుక్తులచేయరాదు । ముక్తి వి । రక్తిలేక రాదు । శక్తులెల్ల ఈభుక్తి కొరకు గురు । భక్తిలేక నిజముక్తి లభించదు. ।ఎ।

7. ఎరుగుము నిజజ్ఞానం । విడువక । నరకుము యభిమానం । ఎరిగిన నీ నిజరూపంబును శ్రీ ।గురు మహాదేవుని చేరి సుఖింతువు ।ఎ।

## 14 వ తత్వం

తనువే నేననరాదురా । నీవీ॥ తనువును కనుచుండు జ్ఞానరూపుడురా ।త।

1. తనువిది పుట్టుచుండు । ఈ । తనువిక కర్మతీరిన గిట్టుచుండు । తను మాంసపిండ ముజూడు । దీని ।కనుచుండు నీవు జ్ఞానస్వరూపుండు ।త।

2. తనువిది జడమగుచుండు । ఈ । తనువిక మలమూత్ర భాండమైయుండు తను రోగమయమగుచుండు । చూడి । తనువిది తుదకు భస్మంబగుచుండు ఇట్టి ।త।

3. ఇంటిలోనున్నట్టి వాడు । తానా । ఇంటిలోనున్నను వేరైయున్నాడు । మంటిల్లువాడికకాడు । నీవ । ట్లంటక దేహమునందుండువాడు ।త।

4. తనువున నిల్చియున్నావు । నీవీ । తనువును వదలుచు వెడలుచున్నావు నినువదల పీనుగీ తనువు । ఇట్టి । తనువే నేనని నీవు పుట్టిగిట్టుదువు కాన ।త।

5. ఎరిగివిషయములనీవు । కొన్ని । ఎరిగినవిషయముల్ మరచుచున్నావు ఎఱుకమరపు లెరిగెదవు । శుద్ధ॥ ఎరుకరూపుడు మహాదేవుడై నీవు ।త।

## 15 వ తత్వం

సత్తుచిత్తానకదము । అది । నిత్యనిజ పరిపూర్ణము । తత్వమెరిగిన కాన వచ్చెడు ।
ద్వైతమెల్లయు మిధ్యయే ।స॥

1. తెలిసెనంటే తెలియలేదుర తెలియదంటే తెలుసును । తెలిసినదియన
   తెలియలేదన తెలివియై వెలిగించును. ।స॥
2. సురులు అసురులు నరులు కిన్నరు । లెరుగరెవ్వరు నిజమును । మరచి
   తిరిగెడు వారి నెరుగును । ఎరుగువారి నెరుంగును. ।స॥
3. దీని నెరిగిన వానికెరుగను । కానరాదుర విషయము । దీనినెఱిగిన
   చిన్మయుండగు వానికుండదు శోకము ।స॥
4. దీనినొక్కటి తానెరింగిన । తానెరుగు సర్వంబును । మానవులలో
   కోటికొక్కడు దీనినెరిగి సుఖించును. ।స॥
5. అందుగలదని యిందులేదని । సందియము పొందకుమురా । సందు దెలిసిన
   నీదుహృదయము । నందె వెలుగుచు నుండురా ।స॥
6. మరచి తనుదా తిరుగు నరునికి । నెరుగ దీని నసాధ్యము । గురుమహాదేవునికి
   శరణను । శరణులకు నతిసులభము. ।స॥

## 16 వ తత్వం

నాదనామక్రియ రాగము :- ఆదితాళం

1. ఏమి సుఖంబని దేహము నేనని తిరుగుచు చెడెదవు ఓ మనసా
   నీమూఢతనంబును మానుచు నీనిజము నెరుంగుము ఓ మనసా ।ఏ॥
2. భామ సుఖంబని భావించెదవే మాంసమూత్ర భాండముగాదా । భామ
   సుఖంబని విశ్వామిత్ర పరాశరు లెల్లరు చెడలేదా ।ఏ॥
3. చాలుచాలు ఈ కామము మానుము సుఖలేశంబైనను లేదు । మూలము
   సర్వానర్థంబుల కిది దీనిని చంపక గతిలేదు. ।ఏ॥
4. లోభియగుచు ధనమార్జించితివి ధనమిది వెంబడి రాగలదా । లోభము

సర్వగుణంబుల జంపును లోభికి నిజగతి కాగలదా. ।ఏ।

5. పుత్రులు సుఖమని పుత్రులకొరకై మోహముచే కష్టించితివి ।
పుత్రులు నీగతి లేశమైన లెక్కింపక బోవుట జూచితివి ।ఏ।

6. ఈధరణిని తామెందరుయేలిరో యెందరు చనిపోయిరో జూడు ।
నాదినాదియని అందరు వెళ్లిరి దేనిని కొనిపోయిరో జూడు ।ఏ।

7. తరుణి సుఖము భోజనసుఖమది నిద్రాసుఖమది యందఱికొకటే ।
ధరణిని యేలెడు రాజులకైనను బీదలకైనను సుఖమొకటే ।ఏ।

8. రాజులు రాజయి రాజ్యమునేలిన చావకుండునే ఓమనసా । ఈజగమున
కాదేవుడు వచ్చిన మరణము తప్పదు ఓ మనసా ।ఏ।

9. తరుణినిగూడుచు సుఖమని ముచ్చటలాడెడువేళల ఓమనసా ।
పొరుగున ఎవరో మరణించిరి యనివింటే సుఖమగునే ఓ మనసా ।ఏ।

10. భక్తిని దృఢముగ నిలుపుచు దేవుని ముక్తిని వేడుము ఓ మనసా ।
ముక్తికి సాధన సామగ్రులలో భక్తియె బహుముఖ్యము మనసా ।ఏ।

11. దృఢవైరాగ్యముజెందుము ఈసంసారభ్రాంతిని విడు మనసా
విడువకతత్వ విచారముజేయుచు నీ నిజమెరుగుము ఓ మనసా ।ఏ।

12. కాలంబంతయు వ్యర్థంబాయెను కాలుడువచ్చెను ఓ మనసా ।
ఫాలలోచనుని శరణనువారికి కాలుని భయమేలనె మనసా ।ఏ।

13. తనువే నేనన మరణమువదలదు నరకము తప్పదు ఓ మనసా ।
తనువును వదలుచు గురుమహదేవుని జేరిన సుఖమగునో మనసా ।ఏ।

## 17 వ తత్వం

1. ఎవరు ఎరుంగరు మావూరు ।ఏ। చివరలేనిదే మావూరు ।
వివర మెఱింగిన మావూరు । ఈ । భవులెఱుంగనిది మావూరు ।ఎ।

2. చూపుకు చిక్కదు మావూరు ఏ ।రూపములేనిది మావూరు ।
తాపమెఱుంగదు మావూరు । పుణ్య । పాపము లెఱుగదు మావూరు ।ఎ।

3. భీరులెఱుంగరు మావూరు ।నిజ। ధీరుల కెఱుకగు మావూరు ।
పారరహితమే మావూరు ।సుఖ। సారమైనదే మావూరు । ।ఎ।

4. లక్ష్యమూలమే మావూరు । బహు । లక్షణమయినది మావూరు ।
సాక్షిగనున్నది మావూరు । ఈ । కుక్షిలోనున్నది మావూరు

5. చీకటికావల మావూరు । నాకలోకులెరుంగరు మావూరు
ఏకంబైనది మావూరు ।రాక। పోకల నెరుగదు మావూరు ।ఎ।

6. వదలిన వదలదు మావూరు । అన్ని । వదలగ మిగిలిన దావూరు ।
నిదురనెరుంగదు మావూరు ।యమ। బెదరు నెఱుంగదుమావూరు । ।ఎ।

7. మఱపునెఱుంగదు మావూరు ।శుద్ధ। ఎఱుకస్వరూపమెమావూరు ।
గురుమహా దేవునిదావూరు । గురు । శరణులభాగ్యంబావూరు ।ఎ।

## 18 వ తత్వం

1. భ్రాంతిని జెందకురా ।నిజమున। శాంతిని బొందుమురా ।
చింతలమూలము ఈమలయంత్రము । సంతతదుఃఖాలయమని యెంచుము.
భ్రాం।

2. ధనమిది సుఖమగునా । దీనిని । కొనిపోవుటకగునా ।
ధనలోభముచే ధనమార్జించిన । తనయులకగునో అన్యులకగునో ।భ్రాం।

3. సతిసుతులిక సుఖమా । వారలు । హితమగుటకు తరమా ।
సతియేముందో సుతులే ముందో మతిహీనుండగు నీ వేముందో ।భ్రాం।

4. డంబముతోమెలగి । గురుచర । ణాంబుజముల నీగి । అంబుజాక్షి
సుఖమని తిరిగిన మల । కుంభమునందున నరకము తప్పునే ।భ్రాం।

5. మాంసపుతనువేడ । అపర । హంసుని ఘనమేడ । సంశయరహితని
జాంశము నెఱుగక । సంసృతిదుఃఖముచే హతుడైతివి ।భ్రాం।

6. భజన ముగియలేదు । దేవుని । నిజము దెలియలేదు । అజహరిరుద్రుల
భజనలెల్ల నీ । నిజమునెరుంగుట కొఱకని నమ్ముము. ।భ్రాం।

7. గురువే శరణనుము । దృఢముగ । నెరుగుము నీ నిజము । ఎరిగిన
నీ నిజరూపము నీవే । పరమగురు మహాదేవుండగుదువు. ।భ్రాం।

## 19 వ తత్వం

తాననువాడెంతసుఖరూపుడమ్మా । ఆనందనిధి వీని కానలేరమ్మ ।

1. నేను నేననుచును నానాతనువులందు । తానిండియున్నను దేని నంటకనుండు ।తా।

2. ఆలుబిడ్డలకన్న చాలధనముకన్న । వేలమేడలకన్న । ఏలెడు పృథ్వికన్న ।తా।

3. సర్వము తానేయగు సర్వముతానేజూచు । సర్వమునంటని నిర్వికారుండగు. ।తా।

4. దేనిని హితమని తాను తలంచిన । దానిని సుఖముగ తానే జేయును ।తా।

5. ప్రాణి సమూహమెల్ల ఈ నిఖిలము మరచి వీని జేరుచు నిద్రలోన సుఖింతురు. ।తా।

6. మానసంబున వెల్లు మానసంబును జూచు । వీనిని కన్నవాడు తానే తానై
వెలుగు ।తా।

7. జాతినీతులకన్న రీతినెరుగకున్న । భీతినెరుంగని ప్రీతిరూపుండగు ।తా।

8. పురుషుడు కాకున్న । తరుణియు కాకున్న । పురుషుల తరుణుల పరమ భాగ్యం
బగు ।తా।

9. ఎరిగిన వారికి గురుమహాదేవుడై । మరణము నెరుగక మెరయుచు నుండును ।తా।

## 20 వ తత్వం

1. లేదు లేదుర ముక్తి భాగ్యము । నీవేమిజేసిన । రాదు రాదుర ముక్తి
సౌఖ్యము । నీదు వాసన లెల్లకాల్చుచు । బూది సేయక దృఢముగా గురు ।
పాదములె గతియనుచు నమ్మక । బోధ రూపుండగుచు నిలువక ।లే।

2. విషయ సుఖముల విషమయం బనుచు । నమ్మి దృఢముగ విషయ

సుఖముల నొల్ల నే నసుచు । కష్టమైనను నష్టమైనను దుష్ట జనులను
వదలి సాధుల । గోష్ఠియందున నిల్చి నీ నిజ । నిష్ఠ సలుపక శాంతి జెందక
।లే।

3. దాన ధర్మము లెన్ని జేసినను గంగాది నదుల । స్నానముల నీ వెన్ని
జేసినను పుణ్యముల నార్జించి నీ వతి । గణ్యుడైనను మాన్యుడైనను
చిన్మయాత్ముని  నెఱుగలేకా । షణ్ముఖీ ముద్రలను జూచిన. ।లే।

4. దేశదేశములెల్ల తిరిగినను । నీవు నానా । వేషభూషల నెన్నిజేసినను ॥
ఆశమానక దాసుడనియో । గీశుడని సన్యాసియని వుప । వాసియను
చును తిరుగుచుండిన । కోశవాసుని నీ వెఱుంగక. ।లే।

5. యాగ యోగము లెన్ని జేసినను । నీవు నానా । భోగభాగ్యములను
భవించినను ॥యాగములచే దేవభోగము । యోగమునఈకాయ
సిద్ధియు । త్యాగ మొక్కటె ముక్తికను యా నైగమౌ క్తిని నమ్మకుండిన. ।లే।

6. జాతరలనీ వెన్ని జూచినను । కాశి మొదలగు । క్షేత్ర వాసములెన్ని
జేసినను ॥ తీర్థయాత్రలుజేసి పరమ పవిత్రుడనుచును నిత్యకర్మల ।
భక్తితో నీ వెన్ని జేసిన తత్వమసి వాక్యార్థ మెరుగక. ।లే।

7. భజనలను నీ వెన్ని జేసినను । హరిహరాదుల । నిజమునెరుగక ఎంత ।
మ్రొక్కినను । భుజముఖంబుల పూసిబూదిని । ద్విజవరుండనివిఱ్ఱవీగిన
సుజనసాధులపూజసేయక । నిజ మెరుంగక గురుని గొలువక ।లే।

8. సోహమర్థము దెలిసి జెప్పినను । వట్టిమాటల । బ్రహ్మమే నే ననుచు
నుడివినను । దేహమే నేననెడి దుర్వ్యా । మోహమెల్లను గాల్చ కుండిన ।
వూహపోహలకందకుండెడు । బ్రహ్మయై తా నిలువకుండిన ।లే।

9. ధ్యానముల నీ వెన్ని జేసినను । కష్టపడుచును ।మౌనమును సాధించి
తిరిగినను । నేనె నీవను మర్మమెరిగిన । జ్ఞాన మొక్కటె చాలుముక్తికి ।
దీని నమ్మక యేల చెడెదవు ? ఆ నిగమములు నుడువు నిట్లని ।లే।

10. వేద వేదాంతముల జదివినను । భేదవాదుల । వాదమందున నీవు
గెల్చినను । భేదబుద్ధిని నీవుమానక । ఖేదమోదములెల్ల సమమై ।
సాధనంబులు శూన్యమై నిజ । బోధరూపుండగుచు నిలువక ।లే।

11. కరణముగ దుర్భావముల విడచి । సతి సుతాదుల । దురభిమానము
నెల్ల నీ వణచి । పరమ గురుమహాదేవ చరణము । శరణ మనుచును
నమ్మి నీలో । మరణభీతిని బారదోలుచు । పరముడే నీవనుచు నిలువక ।లే।

## 21 వ తత్వం

చూడమ్మచూడు పరమాత్ముని ।నీలో । చూడమ్మ చూడు పరమాత్ముని
గూఢముగ నీలో ఆడుచున్నాడు. ।చూ।

1. తనువున నుండు వాడెవ్వడు ।ఈ । తనువే నేనను వా డెవ్వడు ।
మఱి తనువును వదలు వాడెవ్వడు । తానే । చిన్మయుడగుచును ఘన
తేజమైనాడు. ।చూడు।

2. ఆహా ! చూడుము స్థూలదేహము । స్థూలదేహమునందు లింగ
దేహము । లింగ । దేహమునందు । మాయాదేహము । మూడు
దేహములంటని శుద్ధ చైతన్యము. ।చూ।

3. తానీ తనువు కానేరడు । భిన్న । ధ్యానంబునకు చిక్కజాలడుచూడు
తానే ఈరేడు లోకాధారుడు । సత్య జ్ఞానానందుడై నిత్య పరి
పూర్ణుడైనాడు. ।చూ।

4. కనులజూచెడు వాడెవ్వడు । చెవుల । విని శబ్ద మెఱుగువాడెవ్వడు మన
సున భావమెఱుగువాడెవ్వడు । తానే ।ఘనజ్ఞాన రూపుడై సాక్షియై
వెలుగుచుండు. ।చూ।

5. పారరహిత సుఖరూపుడు । ఆ । కారరహిత నిర్వికారుడు ।
ఈశ । లీరమందున్న దేనినంటడు ।తానే । ధీర శ్రీసద్గురుమహాదేవుడే వీడు
।చూ।

## 22 వ తత్వం

1. ఎప్పుడు హెచ్చరిక । జీవా । తప్పకు హెచ్చరిక । తప్పిన హెచ్చరికను
నిజ సుఖమును । తప్పించును నిను భవమున ముంచును. ।ఎ।
2. తప్ప జేయ నేల ।మనసున । నొప్పి జెంద నేల ॥ తప్పల జేయక
నొప్పిని జెందక ।నొప్పించక నీవన్నుల నెన్నడు ।ఎ।
3. ఆశ పడగరాదు । సుఖమా । లేశమైన లేదు ॥ ఆశల వదలక మనసున
నితరుల । మోసము జేసెడి వేషములెందుకు ।ఎ।
4. పాపము జేయకుము ।ఊరక । తాపము జెందకుము ॥ ఓపికతో
సకలేంద్రియ నిగ్రహ । మేప్రొద్దున నీ వేమఱకుండుము ।ఎ।
5. దోషము పోలేదు । నిజ సం । తోష మొదగలేదు ॥ నాసరి ఎవరని
మీసము ద్రిప్పిన । శాశ్వతమగునే నీకీ బ్రతుకిది ।ఎ।
6. బుద్ధిని దిద్దుసుమా । నీవు అ । బద్ధము లాడకు మా ॥ ముద్దులకై న బద్ధ
ములాడక । శుద్ధబుద్ధిచే నిను నీ వెఱుగుము. ।ఎ।
7. దుష్టుల జేరకురా । చేరిన । భ్రష్టుడవగుదువురా ।। శిష్టుల జేరుము
శ్రవణము జేయుము । కష్టపడక ముక్తియు దుస్సాధ్యము ।ఎ।
8. ఇచ్ఛల మానుమురా । అదిబహు । పిచ్చి పిశాచమురా ॥ ముచ్చట
లాడుచు కాలము గడిపిన । చచ్చినపుడు నీ వొక్కడె గాదా ।ఎ।
9. భావ శుద్ధిలేక । నీ నిజ । భావమెరుగలేక । జీవభావమును వదలి గురు
మహా । దేవుని జేరక ముక్తి లభించదు. ।ఎ।

## 23 వ తత్వం

1. హంసనే పరమాత్మయనుచును భావించు సంసారి కాదను హంస ।
సంసారియనుచును భేదభావముచేత తోచుచుండును నీకు ।హం।
2. దేహమోహముచేత దేహమేనేనని భావించి చెడకుము హంస ।
దేహమునందుండి సర్వమునెఱిగెడు జ్ఞానరూపుడు నీవు ।హం।

3. ఎన్ని జన్మములనుకడచి నీవీజన్మమునకు వచ్చితివి జూడుము ।హంస।
అన్ని జన్మములందు చావక వచ్చిన మరణ ముండునె నీకు।హం।

4. కావుననీవు అనాదిరూపుండవు సద్రూపుండవు నీవు హంస ।
నీవు నీనిజతత్వమెఱిగిన ఘనసచ్చిదానంద రూపుడవె హంస ।హం।

5. జ్ఞానమె సకల విషయములనెఱగుచు చిద్రూపమనబడుహంస ।
జ్ఞానమె తన్నెరుగుచు స్వయంప్రకాశమనబడు చుండును హంస ।హం।

6. చిద్రూపుండగు నీవే నీనిజమెఱిగిన సుఖరూపుండవు నీవే హంస ।
క్షుద్రతనముమాని నిజసుఖమెఱుగుచు భద్రముగానుండు హంస ।హం।

7. నీ సుఖమును కోరి సతిసుతాదుల నీవుమోహించుచుందువు హంస ।
నీ సుఖమునకు భంగముకల్ల సతిసుతులెల్ల విషము నీకు హంస ।హం।

8. హితమైతే విష్ణువు దేవుడగును నీకుహితమైతే శివుడు దేవుడుహంస।
హితముతప్పిన శివవిష్ణువులిద్దరు నిర్నామమగుదురు హంస । ।హం।

9. హితమది నీయందు తోచుచునుండును వేరెందు కానదు హంస ।
హితమది నీ నిజరూపము గురుముఖమున దీని నెఱుగుము హంస। ।హం।

10. సుఖముగ నిద్రించి విషయములేకనె సుఖరూపుండవు నీవెహంస ।
సుఖము జ్ఞానము నీదునిజరూపమగుచుండు వదలరాదురదీని హంస ।।హం।

11. భూమినిన్నంటదు జలమదితడపదు అగ్నిదహించదు హంస ।
నీమహిమనుజూడ గాలిసోకదు నీకు గగనము చాలదు హంస । ।హం।

12. కావున నాశరహితుడై నిత్యస్వరూపుడై యున్నావు హంస । చావు
భీతిని పారదోలుచు నీవిక సుఖముగ నుండుము హంస ।హం।

13. నేను నేననుచును నానా దేహములందుయున్నవాడవు నీవే హంస ।
జ్ఞానస్వరూపుడై శుద్ధనిరాకార పరిపూర్ణుడవు నీవె హంస ।హం।

14. జగమెల్ల భావరూపంబున నీయందే నిల్చియుండును జూడు హంస ।
జగదాధారుడు నీవే స్వప్నమునందున యనుభవమిదిగాదాహంస ।హం।

15. బుద్ధివృత్తులనెల్ల నెఱుగుచునుండెడు సాక్షిరూపుడునీవు హంస ।
శుద్ధచిదాకాశరూపుడై భవబద్ధు డెన్నడు కాలేదు హంస ।హం।

16. "సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ" యనిచెప్పు వేదము హంస ।
"తత్వమసి" యని శ్రుతులెల్ల గురుమహాదేవుడే నీవను హంస ।హం।

## 24 వ తత్వం

1. ఎట్టుముక్తిని నీవు పొందెదవు । నీవిట్లుబ్రతికిన । ఎట్లు భవసాగరము
దాటెదవు । ఇట్టిజీవితమెందుగలదని । భ్రష్టుడై నిజతత్వమెరుగక ।
ఇష్టసుఖములప్రాప్తికొరకై । కష్టపడుచును తిరుగుచుండిన. ।ఎ।

2. మోహచేష్టల నీవు చేయుచును । పరసతులందుర్వా । మోహదృష్టిని
నీవుజూచుచును । దేహమేనేననెడి దుర్వా । మోహమది నీమానసం బున ।
సాహసంబున పూని నిన్నా । బ్రహ్మమార్గమునందు జేర్చదు ।ఎ।

3. ధనమెసుఖమని గట్టిగానమ్మి । ఆధనముసంపాదనకు ధర్మములెల్ల
నెగజిమ్మి । తనయునైనను । ధరముకొరకై మోసపుచ్చుచు ।
పుణ్యపాపపు చింతలేకనె । ధనికుడని గర్వించి తిరిగిన ।ఎ।

4. ఎంతసాహసియగుచు వెదకినను । సంసారమందుర । వంతసుఖమును
పొందకుండినను । చింత సతిసుతచింత, ధనపరకాంతరంకులచింత,
ముప్పుకుచింత । రోగపుచింత చావుకు । చింతలను ఈ సంతయందున ।ఎ।

5. ఇచ్చటికి ఎందుండివచ్చితివో । ఈతనువు వదలిన । ఎచ్చటికి నీవెట్లు
బోయదవో । తుచ్ఛసుఖములగోరి మనసున । ఇచ్ఛవచ్చినరీతి మెలగుచు ।
పుచ్చుగా వ్యర్థముగకాలము ముచ్చటా నినుగన్న యమునికి ।ఎ।

6. నిక్కికర్మలనీవుజేసినను । దేవతనెల్లర । పెక్కువిధముల మ్రొక్కి
వేడినను భక్తితో రుమహాదేవుని । యుక్తినిమ్మని మ్రొక్కివేడక
నిక్క మెరుగవు ముక్తిచిక్కదు । చిక్కినను అది దక్కజాలదు ।ఎ।
ఊరక పరశివుడగునే । తాను । మిరక మాయను తన్నెరుగకనే ।

## 25 వ తత్వం

1. దేహమోహమును విడువక । తన్ను । కోహమనుచు తాను తనలో ।
నెఱుగక । సాహసపరుడై నిలువక । పర । బ్రహ్మానుసంధానపరుడు
తాకాక ।ఊ।
2. ధ్యానము జేసినరాదు ।తను। మానాభిమానము తావదలలేదు ।
కాననముల నున్నరాదు । శుద్ధ । జ్ఞానమె తానయి నిలువకరాదు ।ఊ।
3. శిస్తుతో  నడచినరాదు ।తర్క। కుస్తీల గెల్చిన సాధ్యముగాదు ।
పుస్తకమున చిక్కబోదు । పర । వస్తువే తానై సుఖించరాదు ।ఊ।
4. విరతి గట్టిగ నిల్వలేదు ।మది । కొరతలు మెండయి నిజమెరుగలేదు ।
మరణభీతియు పోనులేదు । నోట । పరమాత్మతాననన్నఫలమేమిలేదు ।ఊ।
5. ఎఱుకే తానై నిల్వలేదు । ఈ కరణకార్యముల నంటక నిల్వలేదు ।
పరమానందము బొందలేదు ।శ్రీస । ద్గురుమహాదేవునితాజేరలేదు. ।ఊ।

## 26 వ తత్వం

1. కామమును బహుచులకగా నీవెంచి మోసము బోకుము ।
కామమది యెటువంటివారిని నైన మ్రింగును జూడుము. ॥కా॥
2. హరియు సుందర మోహినీ రూపంబు తా ధరించెను ।
హరుడు తానా మోహినీరూపంబుగని మోహించెను. ॥కా॥
3. కని అహల్యను మోహమందిన ఇంద్రుడేగతి బొందెను
ఘనపదంబును మరచి ఇంద్రుడు కోడియై తాకూసెను. ॥కా॥
4. నాకలోకపు ఇంద్రుడెక్కడ కోడియెక్కడ జూడు । మా
నాకనాధుని కిట్టి దుర్గతియేల కల్గెను జూడుమా ॥కా॥
5. ముని పరాశర వ్యాస విశ్వామిత్ర నారద ప్రముఖులు
కనుచు వనితల మోహమందుచు భ్రష్టులై రా తపసులు ॥కా॥
6. దేవతలు రాక్షసులు ఋషులును కామబాధకు చిక్కిరి ।

వేవిధంబుల కష్టముల తామనుభవించుచు చచ్చిరి ॥కా॥

7. సురులు నసురులు మునివరులు తామిట్టి దుర్గతి బొందిరే ।

నరుడు కామము నే జయించితినన్న బుధులిక నవ్వరే ॥కా॥

8. కొండ నీటను తేరుచున్నది చూడుమన అది సత్యమా ।

తిండిపోతీ నరుడు కామము నిగ్రహించుట సత్యమా ॥కా॥

9. సురుల నసురుల నరుల పశువుల పక్షి క్రిమికీటకముల ।

చెరచి కామము నరకమున పడద్రోసి చంపును జీవుల ॥కా॥

10. తపసు జెరచును బుద్ధి జెరచును శాంతి తేజము జెరచును ।

జప సదాచారముల జెరచును పాపముల కొడిగట్టును ॥కా॥

11. నరకమార్గము జేర్చునట్టి కామమును తెగనరకుము

గురుమహాదేవునికి శరణన చచ్చిపోవును కామము ॥కా॥

## 27 వ తత్వం

1. యోగిలక్షణముల నెరుంగుచు యోగి సేవను జేయరా ।

యోగిసేవనుజేసి నీవా యోగియై సుఖమొందరా ॥యో॥

2. భోగముల తాననుభవించుచు భోగివలె కనుపించును ।

యోగమందున నిల్చి మృత్యువుగెల్చి శివుడై యుండును ॥యో॥

3. భోజనంబును జేసినను వుపవాసియై తానుండును ।

ఈ జగంబును జూచి కన్నులు లేనివాడై యుండును. ॥యో॥

4. పాపపుణ్యము లెరుగకుండును ధన్యుడై తానుండును ।

పాపపుణ్యములెల్ల నిజబోధాగ్ని యందున గాల్చును ॥యో॥

5. దేహముండిన దేహముండదు బ్రహ్మమై తావెల్గును ।

మోహముండదు పామరులకును మోహివలె కనుపించును ॥యో॥

6. సిరిని తనయుల వనితలంబున పొంద డభిమానంబును

కరణ మందున వెలుగు హరుడై ధీరుడై విహరించును. ॥యో॥

7. కర్మలను తాజేసినను యా కర్మలంటక నుండు ।
కర్మలను తాజేయకున్నను మర్మమెరిగి సుఖించును ॥యో॥
8. తన్ను జగమున జూచుమణి తనయందు జగమును జూచును ।
భిన్నమెరుగక చిన్నయుండై తాను తానై వెల్గును. ॥యో॥
9. వీడె నిజముగ నిద్రగెల్చిన యోగివిర్యుడు జూడరా ।
వీడె సాక్షాద్గురు మహాదేవుండనుచు సేవించరా. ॥యో॥

## 28 వ తత్వం

1. నేనీ తనువని మూఢుండగుచును నినుమరచిన నీకేమి ఫలం ।
నీ నిజతత్వము నీ వెరుగక నే మనుజుండన నీ కేమిఫలం ।నే।
2. పశు పక్షి క్రిమి కీటక తనువుల వదలుచువచ్చితి వేమిఫలం ।
అసమానంబగు మానవదేహము బొందితివే నీ కేమిఫలం ।నే।
3. మానవులందున విప్రుండైతివి వేదము జదివితి మేమిఫలం ।
నానాకర్మల జేయుచు నీవిక శిష్టుడైతివి యేమిఫలం । ।నే।
4. నా లోకమున కేగుచు నా దివిభోగము లొందితి వేమిఫలం
ఆ కర్మల ఫలమది తీరిన ఈ ధరణికి మరలితి వేమిఫలం । ।నే।
5. ప్రాణంబుల బంధించుచు నీవా యోగము జేసితి వేమిఫలం ।
నానా సిద్ధుల బొందుచు గగనంబున తిరిగిన నీ కేమిఫలం ।నే।
6. మహిలో నుండుచు మూడు దినంబులు సిద్ధిని జూపితి వేమిఫలం ।
మహిమల జూపిన అహమది విడువదు భవమికతొల్గదు
యేమిఫలం ।నే।
7. మౌనంబున నిద్రించక నేడు దినంబులు గడిపితి వేమిఫలం ।
జ్ఞానము నెరుగని మూఢులు నిను బహుమాన్యుండన నీకేమి ఫలం ।నే।
8. కన్నుల చెవులను ముక్కు మూసుకొని ముద్రల జూచితి వేమిఫలం ।
పున్నమ వెన్నెల కంటివి నీలో వింటివి నాదము లేమిఫలం ।నే।

9. పాత్రల కడుగుచు దాట్లను వేయుచు మడియని కిరిచితి వేమిఫలం ।
గాత్రమె నీవని పవిత్రమని గోమూత్రము త్రాగితి వేమిఫలం ।నే।
10. తత్త్వమసి మహా వాక్యార్థపు నిజతత్వము నెరుగక యేమిఫలం ।
మృత్యుంజయుడై మాయనుదాటక నీ విక నరుడై ఏమిఫలం ।నే।
11. పరమగురు మహాదేవుని జేరుచు నీ నిజతత్వము నెరుగుమురా ।
ఓ నరదేహంబిది వ్యర్థము జేయక సార్థకమొంది సుఖించుమురా. ।నే।

## 29 వ తత్వం

జీవా నీ వెవ్వండనుచును జూడు । నీవే నీలో । జీవా నీ వెవ్వండనుచును జూడు । నీవు లేక ఈ కాయము పీనుగ । కావున నీవీ కాయము కాదని ॥నీవె॥

1. ఘటమును జూచెడు పురుషుడు తానా । ఘటమెన్నటికిని కాజాలడు
గద । అటులీ కాయము జూచెడు నీవే । దిటముగ ఆ నిజసాక్షివి
గావా ॥జీ॥
2. ప్రాణాపానవ్యానోదాన స ।మానములను ప్రాణంబుల గతులను
మానకనీవే ఎరుగుచునుందువు । ప్రాణంబులకును ప్రాణమునీవే ॥జీ॥
3. జ్ఞానేంద్రియముల కర్మేంద్రియముల మానస సంకల్ప వికల్పము
లను నానాబుద్ధి వికారములెల్లను మానక ఎరిగెడు సాక్షివినీవే ॥జీ॥
4. జాగరమందున స్వప్నంబుండదు । జాగర మా స్వప్నంబున నుండదు ।
జాగ్రత్స్వప్నముల్సు ప్తినిలేదు । బాగుగ వీటికి సాక్షివి నీవే. ॥జీ॥
5. ఎన్నో జన్మంబుల కడచితివి । పుణ్యవశంబున మానవుడైతివి । ఎన్న
టెన్నటికి నుండెడు వాడవు । ధన్యుడ నీవే సద్రూపుండవు ॥జీ॥
6. కలలో నగుపడు వస్తువులెల్లను । వెలిగించుటకు ప్రకాశంబెవరిది ।
కలలో కలరే భాను చంద్రాగ్నులు । వెల్గించుచు వెల్గువాడవు నీవే. ॥జీ॥
7. నీవుండిన దేహము సౌందర్యము । నీవుండిన దేహవ్యామోహము ।
నీవుండిన ఈ దేహము సౌఖ్యము । నీ వుండనిచో మన్నగు దేహము ॥జీ॥

8. ఎల్లపుడుండెడు సద్రూపుండవు । ఎల్ల నెరింగెడు చిద్రూపుండవు ।
ఎల్లప్పుడు నిజసుఖ రూపుండవు । ఎల్లెడలుండెడు పరిపూర్ణుండవు ॥జీ॥
9. పరమగురు మహాదేవుని జేరుము । ఎరుగుము దృఢముగ నీ నిజ
రూపము । మరణభీతి నిర్మూలము చేయుము । పరమానందము జెంది
సుఖింపుము ॥జీ॥

## 30 వ తత్వం

1. ఆహా ! ఈదేహంబే నేనని ఎన్ని విధంబుల నే చెడితి ।
బ్రహ్మము నేనను మర్మము నెఱుగుచు నే నిజసుఖ రూపుండైతి ॥ఆ॥
2. గుట్టు నెరింగిన సత్తు చిత్తు ఆనంద స్వరూపము నాదాయె ।
పుట్టుచు పెరుగుచు తిట్లను తినుచును చెడుచును గిట్టుట నీకాయె ॥ఆ॥
3. నిర్మల నిర్గుణ నిత్య నిరంజన నిజసుఖరూపము నాదాయె । చర్మము
రక్తము మాంస మమేధ్యము మూత్రంబే నీ ఒడలాయె. ॥ఆ॥
4. ఏవిధబంధము నెఱుగక శుద్ధ నిరాకారంబే నాదాయె । బావికి
తిరుగుచు నీటిని మునుగుచు గడ గడ వణకుట నీకాయె । ॥ఆ॥
5. మర్మంబెరిగిన నిర్మల చిద్ఘన జ్యోతిస్స్వరూపము నాదాయె ।కర్మల
జేయుచు నిహపరములకును తిరుగుచు చెడుటయె నీకాయె ॥ఆ॥
6. జాతి నెఱుంగక నన్నిట వెలిగెడు చేతన స్వరూపము నాదాయె ।
సూతక మనుచును దూరము తొలగెడు భ్రష్టత్వంబే నీ కాయె ॥ఆ॥
7. కోశవాసుడై నాశ మెరుంగని నిత్య స్వరూపము నాదాయె ।
వైశ్వానరునికి ఆహుతి యగుచును బూడిదయగుటే నీకాయె ॥ఆ॥
8. భంగ మెరుంగక అంగాంగంబుల నిండుచు వెల్గుట నాదాయె ।
అంగ విహీనుండగుచును తిరిపెము నెత్తుచు తిరుగుట నీకాయె ॥ఆ॥
9. నన్నుగన్న వారందరు సుఖ చిన్మయులై ముక్తిని పొందెదరు ।
నిను నే వదలిన పీనుగ యిదియని జనులందరు భయమొందెదరు ॥ఆ॥

10. ఎఱుగక తత్వము నీవే నేనన ఎన్ని గర్భవాసములాయె ।
గురు మహదేవుని శరణన నాకిదియే కడపటి జన్మంబాయె. ॥ఆ॥

31 వ తత్వం

1. ఎరుకే నీవని తెలిపిన గురుబోధ నెఱిగినవాడే జాణ ।
ఎరుకే దృశ్యము నంతటి కాధారమని యెఱిగినవాడే జాణ ॥ఎ॥

2. ఎరుకే నిజ పరబ్రహ్మ మటంచును ఎఱిగినవాడే జాణ ।
ఎరుకే నిర్మల చైతన్య మనుచును యెరిగినవాడే జాణ ॥ఎ॥

3. ఎరుకే నిర్గుణ నిర్వికారంబని ఎరిగిన వాడే జాణ
ఎరుకను వదలిన మిగిలిన దెల్లను జడమని వదలిన జాణ । ॥ఎ॥

4. ఎరుకే నిజసుఖ రూపంబటంచును ఎరిగిన ధన్యుడు జాణ ।
ఎరుకే ఆ పరంజ్యోతిస్వరూపము యని యెరిగిన వాడే జాణ ॥ఎ॥

5. ఎరుకన మరపును ఎరుగని దనుచును ఎరిగిన వాడే జాణ
ఎరుకే మూడవస్థల సాక్షియనుచును ఎరిగిన వాడే జాణ ॥ఎ॥

6. ఎరుకన జ్ఞానము జ్ఞేయము కాదని ఎరిగినవాడే జాణ
ఎరుకే నిజగురు దైవమటంచును ఎరిగిన వాడే జాణ ॥ఎ॥

7. ఎరుకే యీ విశ్వవ్యాపక మనుచును ఎరిగిన వాడే జాణ ।
ఎరుకే ఈ సర్వశాస్త్ర మతంబని ఎరిగిన వాడే జాణ । ॥ఎ॥

8. ఎరుకే త్రిపుటికి ఆధారమనుచును ఎరిగిన వాడే జాణ
పరికింప కన్నుల జూచుచు నుండున దెరుకని ఎరిగిన జాణ ॥ఎ॥

9. ఎరుకే జాతి వర్ణములను ఎరుగని దనుచును ఎరిగిన జాణ
ఎరుకే ధర్మాధర్మములను మీరినదని ఎరిగిన వాడే జాణ ॥ఎ॥

10. ఎరుకే విషయ రూపంబయి నిర్వికారంబని ఎరిగిన జాణ ।
ఎరుకే ఈ కర్మరుల కతి దూరంబటంచును నెరిగిన జాణ ॥ఎ॥

11. ఎరుకే నిజమోక్ష రూపంబటంచును యెరిగిన వాడే జాణ ।

ఎరుకే శ్రీగురుమహాదేవుడనుచును నమ్మినవాడే జాణ ॥వ॥

## 32 వ తత్వం

1. శివుడే తాననవచ్చునా । సాక్షాత్పర । శివుడే తానన వచ్చునా । శివు
నియందైక్యంబునొందక । శవశరీరము బహుసుఖంబని వివిధ విషయము
లనుభవించుచు । భవియగుచు దుఃఖించు జీవుడు. ॥శి॥

2. పాశములను ద్రుంచలేదు । దృడముగా పర । మేశుని తా నమ్మలేదు
ఆశలెల్లను తానుమానక । కేశముల బోడించుకొని స న్యాసి వేషము
దాల్చి ఈ భవ । పాశమున తా చిక్కి జీవుడు ॥శి॥

3. మోహమువదలగ లేదు । వట్టిమాటల । బ్రహ్మము తా ననరాదు
బ్రహ్మ తానని గ్రంథమందున । వూహచేయుచు కనుల మూయుచు ।
బ్రహ్మమే తానని నటించుచు । దేహితా నై మోహియగుచును. ॥శి॥

4. తత్వమందున నిలువలేదు । తనకు జగమున । సత్వబుద్ధియు తొలగ
లేదు । సత్తుచిత్తానందుడని తా । నుత్త మాటల జెప్పుకొనుచును । చిత్త
మందున కలవరించుచు । మృత్యుభీతిని పొంది వణకుచు ॥శి॥

5. వాదబుద్ధియు తొలగలేదు । జీవపరముల । భేదము నశియించలేదు ।
భేద భావములెల్ల వదలి య । భేదభావము సత్యమని నిజ । బోధ
రూపుడుగాక సంసృతి । బాధలకు తాజిక్కి జీవుడు. ॥శి॥

6. ధ్యానభ్రాంతియు తొల్గలేదు దేహమందభి । మానము తావదలలేదు ।
మానకుండిన విషయ చింతల నేను నాదిది యనుట కాల్చక । ధ్యాన
ధ్యేయము మీరిశుద్ధ । జ్ఞానమే తా ననుచు నిలువక. ॥శి॥

7. పరమాత్మ నిజమెరుగలేదు । దృఢముగా తన । నరభావమది తొలగ
లేదు ॥ సర్వమెరిగిన గురుడు తానని । పరుల మోసము జేయుచు
తా ॥ సిరిని సంపాదించుకొని తన । సరి ఎవరులేరని మదించుచు ॥శి॥

8. కర్మభ్రాంతిని విడువలేదు । గట్టిగా నిజ । మర్మము తా నెరుగలేదు ।

చర్మ దేహము నేను కాదని । నిర్మలజ్ఞానంబు నేనను । మర్మమెరుగక
శాంతిజెందక కర్మరుండై బద్ధుడగుచును

9. యోగమార్గము నెరుగలేదు । తనకు ఇహపర భోగ వాసన తొలగ
లేదు । శ్రీగురు మహాదేవ దేవుని । బాగుగా తా జేరుటే నిజ । యోగ
మనుచును నమ్మి దృఢముగ యోగియై తా నిలువకుండిన. ॥శి॥

## 33 వ తత్వం

తన నిజమెరిగిన ముక్తి । తాను । కనరాదురా లోకాంతరమున ముక్తి ।త।

1. వైకుంఠమది ముక్తిగాదు । కను మాకైలాసంబును ముక్తియ గాదు ॥
లోకాంతరమునందులేదు బ్రహ్మలోకప్రాప్తియుకూడముక్తియుకాదు ॥త॥

2. ముక్తివుత్పాద్యకముకాదు ।నిజ। ముక్తియు జూడవైకార్యము గాదు ॥
ముక్తి సంస్కార్యంబుగాదు ।నిజ ।ముక్తిభాగ్యంబది ప్రాప్యముగాదు ॥త॥

3. చక్షువులకు గానరాదు ।నిజ । మోక్షముతనకు పరోక్షము గాదు ।
లక్ష్యమునకు చిక్కబోదు । అప । రోక్షమైయున్నది శూన్యముగాదు ॥త॥

4. కర్మ నిరతుడైనరాదు । దాన । ధర్మముల్ జేసి గణ్యుండైన లేదు ॥
నిర్మోహమందకరాదు । ఘన । నిర్వాణమది సామాన్యంబును గాదు ॥త॥

5. దుడ్డిచ్చి కొనుటకురాదు । అది । బిడ్డలచేయు కర్మలచేత రాదు । గడ్డ
దినుసు తిన్నరాదు । తాను ।గడ్డము పెంచి వేషము వేయరాదు ॥త॥

6. ఉపవాసముండిన రాదు ।ఎన్ని।జపముల జేసి లెక్కించినరాదు ॥
చపలముమానక రాదు ।తాను। విపరీతముగ శాస్త్ర మెరిగినరాదు ॥త॥

7. భ్రాంతుల వదలక రాదు । వే। దాంతశాస్త్రమునెల్ల చదివినరాదు ॥
శాంతినిచెందకరాదు ।ఏ। కాంతము నందు తన్నెరుగకరాదు. ॥త॥

8. భక్తిగట్టిగనిల్వలేదు ।నానా। యుక్తుల వన్ని తర్కింపగరాదు ॥
వ్యక్తిభావము తొలగలేదు । తాను। వ్యక్తము మోరి తన్నెరుగకరాదు ॥త॥

9. దృశ్యము నెల్లను మరచి ఈ ।దృశ్యము నెటిగెడు సాక్షిగ నిలిచి ॥

సాక్షితాననుటను మరచి ।పర। మేశుడౌ గురుమహాదేవుడై నిల్చి ॥త॥

## 34 వ తత్త్వం

లాలిలాలి । మాయాలోలలాలి । కాల కర్మాతీత పరమేశలాలి ।

1. ఈశలాలి । కోశవాసలాలి ॥ కోశాతీత సర్వదృశ్య సాక్షి లాలి ॥లా॥

2. ప్రేమలాలి । సుఖ । సీమలాలి । నామరూప రహిత పరంధామ ॥లా॥

3. ధీరలాలి । సర్వా। ధారలాలి । పారమార్థరూప పరిపూర్ణ లాలి ॥లా॥

4. దీపలాలి । చిత్సుఖ । రూపలాలి । పాపపుణ్య ద్వంద్వాతీతరూపలాలి ॥లా॥

5. ఆత్మలాలి । పర । మాత్మలాలి । సత్యజ్ఞానానంద నిత్యముక్తలాలి ॥లా॥

6. సత్యలాలి ।జగ। న్మిధ్యలాలి । మృత్యుదేవి తవ పాదభృత్యలాలి ॥లా॥

7. ప్రీతిలాలి । విశ్వా। తీతలాలి । భాతి ఆస్తి ప్రీతిరూపమూర్తి లాలి ॥లా॥

8. దేవలాలి । పూర్ణ । భావలాలి । భావరహిత గురు మహదేవ లాలి ॥లా॥

## 35 వ తత్త్వం

చూడు నీ యనుభవమిదిరా, చూచే । వాడే నేనని నీవు నిశ్చయించు మురా

॥చూ॥

1. కనులమధ్యను నీవు నిలిచి । నీవే । తనువెల్ల వ్యాపించి తనువనియెంచి
కని విషయము లనుభవించి । యున్న । ఘన జాగ్రమిది నీవు విశ్వుడని
యెంచి ॥చూడు॥

2. తను నిద్రావశమున మరచి కంఠ మునినిల్చి మనసునెల్ల కల్పించి ॥
ఘన నీ తేజముచేత జూచి ।స్వప్న। మన నిది నీవే తైజసుడని యెంచి ॥చూ॥

3. వదలి స్వప్నావస్థ తాను ।నిజ । హృదయమునందు ప్రాణమును జేరు
చును నిద్రించు సుఖముగ తాను ।కను। మిదిసుప్తియని నేవు ప్రాజ్ఞు
డనుచును ॥చూ॥

4. గురు వనుగ్రహము బొందుచును ।తానే। వర సచ్చిదానంద రూపుం
డనుచును । మరచి బాహ్యాభ్యంతరమును ।శుద్ధ। ఎరుకే తానై

యున్న తుర్య మనుచును. ॥చూ॥

5. పరమాత్మ తానని తలచి ।తాను। పరమాత్ముడను మననంబును
మరచి । గురుమహా దేవుడై నిలిచి । ఇది ।తుర్యా తీతవంబనుచును
నిశ్చయించి. ॥చూ॥

36 వ తత్వం

1. సాధన నిలుపుమురా । నిత్యస । మాధిలో నిలుపుమురా । బోధరూపుడై
శోధించిన మతి । ఏదియు నుండదు నీవేయుందువు. ॥సా॥

2. కనులను మూయుమురా । నీలో మనసును జూడుమురా । మనసును
జూచిన కనబడ దేమియు । కనుటను మానిన నీవే శివుడవు ॥సా॥

3. కనుమూసిన నీవే । చూడుము । కనుదెరచిన నీవే । కనులను మూసిన
కనులను దెరచిన । ఘన చిన్మయుడవు నీవే గాదా ॥సా॥

4. మనుజు డనుట మరచి । ఆ చి । ద్ఘనుడని నీవెంచి । కనుగొనభావంబులు
మిధ్యంబగు । నినుగన నీవే ఆ నిజసాక్షివి ॥సా॥

5. పోతగినదిలేదు । నీకిక। రాతగినదిలేదు। ప్రీతిరూపుడవు దుఃఖములేదు ।
నిత్య స్వరూపుడు మృత్యువు లేదు ॥సా॥

6. విడువ బాధలేదు । నీ విక। పడయు గతియు లేదు ।విడువుము భేద
జ్ఞానము నీలో ।మృడుడే నీవని దృఢముగ నుండుము ॥సా॥

7. చేయు పనియులేదు । పొందగ । ధ్యేయమేమి లేదు । ఆయా
ఇంద్రియ మాయావనితా । జేయగనంతటి జూచెడు సాక్షివి ॥సా॥

8. మరణంబేలేదు । నీ కా। పరలోకము లేదు । మరపును మీరిన నిరఘ
నిరంజన । పరమానంద స్థిర చిన్మూర్తివి. ॥సా॥

9. ఎరుకే నేననరా । కావున మరపే లేదనురా । పరిపూర్ణుండై ఎల్లెడ
లుండెడు । పరమగురు మహాదేవుడేనేనని ॥సా॥

## 37 వ తత్వం

1. జీవుడా నీ నిజమెరుంగక యేల చెడెదవు మూఢుడై। నీవు
నీ నిజరూప మెరుగుచు ముక్తి జెందుము దేవుడై ॥జీ॥

2. స్థూలమని మరి సూక్ష్మమని పరరూపమని మూడుండురా।
స్థూలసూక్ష్మములను వదలి పరరూపమందే యుండరా ॥జీ॥

3. విదితమగు నీ స్థూలకాయము స్థూలరూపము జూడరా।
ఇదియే భోగాయతనమై కడుదుఃఖ మూలంబాయెరా ॥జీ॥

4. మనసు స్వప్నమునందు తా నీ స్థూలరూపము బొందురా।
కనుము ఇది నీ సూక్ష్మరూపము ఇదియు మాయిక మగునురా ॥జీ॥

5. రెండు రూపము లెరుగు చుండెడు తెలివి నీ పరరూపము।
రెండు వుండవు సుప్తిలో నీకుండు నీ నిజరూపము ॥జీ॥

6. బుద్ధి వృత్తుల నెరుగు చుండెడు సాక్షి శుద్ధ జ్ఞానము।
శుద్ధ జ్ఞానమె నీదు నిజరూపంబు అది పరబ్రహ్మము ॥జీ॥

7. కొందరిది పరమాత్మ డందురు కొందరిది శివుడందురు।
కొందరిది నిజ లింగమని నారాయణుండని యందురు ॥జీ॥

8. కొంద రీశ్వరుడందు, రిదియే పురుషుడని మరి కొందరు
కొందరిది విజ్ఞాన మందురు, శూన్య మందురు కొందరు ॥జీ॥

9. కొందరిది పరశక్తి యందురు గణపతియు యని కొందరు।
కొందరేదో ఒకటి యందురు ఆత్మ యందురు కొందరు ॥జీ॥

10. వారి వారికి తోచినట్లుగ పిలిచి రీ జ్ఞానంబును।
సారి సారికి ఇదియె నిజమని ఎరుగుమీ జ్ఞానంబును ॥జీ॥

11. పుట్టి గిట్టదు యే వికారము లేక తానే వెలుగును।
గుట్టెరింగిన నిరఘ నిర్మల నిత్యసుఖమై యుండును। ॥జీ॥

12. మనసు వాక్కుల కందకుండును మూడవస్థల నెరుగును।

తనువు నందున దేని నంటక సర్వ మెరుగుచు నుండును ॥జీ॥

13. భ్రాంతి వదలుము నిర్మల జ్ఞానంబు నేనని యుండుము ।
శాంతి బొందుము శ్రీ గురు మహాదేవుడై నీ వుండుము ॥జీ॥

## 38 వ తత్వం

1. అంతా బ్రహ్మమయం । జీ జగ । మంతా బ్రహ్మమయం । అంత ।
కరణ మనంతరూపముల । వింతగ నగుబడు దంతయు తానే ॥అం॥

2. జ్ఞానమె తానగురా । సర్వము । తానై యగుబడురా । జ్ఞానమె
తానీ మానస మగు నీ । మానసమే ఈ జగమై యగబడు ॥అం॥

3. సాకారుడు తానే । శుద్ధ ని । రాకారుడు తానే । ఏకాకారుడు
తానే నానా । యాకారములను పొందియు పొందడు ॥అం॥

4. హరరూపుడు తానే । ఆ శ్రీ । హరిరూపుడు తానే । హరి హర
బ్రహ్మాదుల రూపుండీ । పరిసృష్టి స్థితి లయముల జేయును ॥అం॥

5. తానే దేవతలు । చూడుము । తానే రాక్షసులు । తానే నర
కిన్నరగంధర్వులు । తానే ఖగ మృగ క్రిమి కీటకములు ॥అం॥

6. వదలగ మిగులునురా । తనుదా । వదల నసాధ్యమురా । వదలిన వద
లదు, కదలదు మెదలదు । బెదరదు యమునికి తానే తానై ॥అం॥

7. అన్నియు తానగురా । తనకిక । అన్యంబుండదు రా । చిన్మయుడై తా
నన్నిట యుండును । అన్నిట నుండి అంటకన యుండును ॥అం॥

8. తానిరవయవుడురా ।కావున । తా నిష్క్రియుడగురా । తానే
సర్వము జేసియు జేయని । జ్ఞానానంద స్వరూపుండగురా ॥అం॥

9. సత్య స్వరూపుడురా । జగమిది । మిధ్యా భూతమురా । ఆస్తిభాతి
ప్రియ రూపుడు తానీ । మిధ్యా జగమున కాధారుండగు ॥అం॥

10. భిన్న మెరుగకుండు । కన్నను । కన్నులు లేకుండ । అన్య మెరుంగడు
భీతి నెరుంగడు । చిన్మయుడై గురు మహాదేవుడే ॥అం॥

## 39 వ తత్వం

ఆనంద మానంద మాయెను । బ్రహ్మానంద మానంద మాయెను ।
నానా భావనలను మానుచు నే నిలువ ॥ఆ॥

1. నేనీ తనువు కాదనుచును । పంచ । ప్రాణముల్ నేను కాదనుచును ।
అట్లే । మానసమును కాదనుచును । నిల్చి । దీనిని కనుచుండు సాక్షి
నేనని ఎరుగ ॥ఆ॥

2. జ్ఞానమె నా నిజరూపము । అట్లే । ఆనందమును నిజరూపము ।
మరియు । నేనే నిత్యము పరిపూర్ణము । కాన । నేనే ఆ ఘన సచ్చిదా
నందుండని ఎరుగ ॥ఆ॥

3. తన సతి సుఖమును వేళల । తన । తనయులు సుఖమును వేళల । ఈ
ధన మతిసుఖమును వేళల । చూడు తన సుఖమే విషయ సుఖ
మాయెనని ఎరుగ ॥ఆ॥

4. విషయము లెల్లను మరచుచు । నిర్వి షయుడై నే నిద్రించుచు ।ఏ।
విషయము లేక సుఖించుచు । చూడు । విషయ రహిత సుఖ రూపు ।డు
నేనన ॥ఆ॥

5. గురు మహాదేవుని బోధను । ఎరిగి । ఎరుకే నేనను తత్వంబును । నేనే ।
స్థిర ముక్తి సుఖరూపుడనుచును । సత్య పరిపూర్ణమగు పరమాత్ముడై
నే నిలువ ॥ఆ॥

## 40 వ తత్వం

1. హెచ్చరిక । హెచ్చరిక । హెచ్చరిక । బహు హెచ్చరిక । విచ్చికనుల
నీ నిద్రను చాలించుము జీవా బహు హెచ్చరిక ॥హె॥

2. చచ్చిపుట్టు ఈ కాయము కాదని సచ్చిత్సుఖ పరమాత్ముడు నేనని ॥హె॥

3. సకల దృశ్యము మిధ్యంబనుచును । నిష్కళంక చిన్మాత్రుడు నేనని ॥హె॥

4. అన్నిటి జూచెడువాడే నేనని । నన్ను జూచువాడెవ్వడు లేడని ॥హె॥

5. అంతఃకరణపు వృత్తుల జూచెడు । సత్య పూర్ణ పరంజ్యోతియు నేనని ॥హె॥

6. జాగ్రత్స్వప్న సుషుప్తుల మూటిని । బాగుగ నెరిగెడు సాక్షియు నేనని ॥హె॥

7. నిద్రలోను సర్వము లీనంబగు నిద్రను గెల్చి । ప్రభువే నేనని ॥హె॥

8. నిను నీ వెరిగిన దృశ్యం బడగు ॥ కనుమిదియే నీ పూర్ణ భావమని ॥హె॥

9. జడ భావములను ఎరుగు చుండెను । మృడుడే నేనని దృఢముగ నమ్ముము ॥హె॥

10. రాగద్వేషము లను చోరులు నీ । యోగ ధనంబును అపహరింతు రిక ॥హె॥

11. జీవుడు నే కాదనుచు గురుమహా । దేవుడె నేనని నెమ్మది బొందుము ॥హె॥

## 41 వ తత్వం

1. ఏల జేసెద విట్టి రాజస పూజలను ఫలమేమిరా ।
మేలు కలుగదు యముడు విడువడు బాధతొలగదు చూడరా ॥ఏ॥

2. నీదు భార్యకు మంచి రోజా మల్లెపూలను దెత్తువు ।
ఆది దేవుని పూజకని గన్నేరుపూలను దెత్తువు ॥ఏ॥

3. తరుణికోరినదెల్ల నిచ్చుచు కష్టమును లెక్కింపవు ।
హరుని సేవకు గురుని సేవకు రేపుమాపని యందువు ॥ఏ॥

4. భరతనాట్యంబన్న పైకము లెక్క పెట్టకపోదువు ।
గురుని సేవకు నిన్ను పిల్చిన తిరిగి వచ్చెద ననెదవు ॥ఏ॥

5. కరముచే జపమాల త్రిప్పచు జపము చేసెదనందువు ।
కరణమందున తరుణి మోహపు లీలసల్పుచు నుందువు ॥ఏ॥

6. సతిసుతాదుల ప్రీతి కొరకై కన్న కష్టము పడెదవు ।
పతిత పావన పరమపురుషుని మరచి నీవే చెడెదవు ॥ఏ॥

7. వేదవాక్యము బోధసల్పిన పొట్టకొరకది యందువు
బాధకల్గిన వైద్యునికి పదివేల రూకలనిత్తువు ॥ఏ॥

8. సతిసుతాదుల మోహమందున కాలమెల్లను గడపుచు ।

మృత్యు దేవత వచ్చి నపుడే వెళ్ళెదవు నీ వేడ్చుచు ॥ఏ॥

9. సాధుపురుషుల సేవ జేయక తత్వ మాకర్ణించక ।
బాధలొందుచు యేల చెడెదవు నీవు నీ నిజమెరుగక ॥ఏ॥

10. నీవు నానా యోనులందున పుట్టి చెడితివి మూఢుడా
నీవు నీ నిజమెరుగ గురుమహాదేవుడేరా జీవుడా ॥ఏ॥

## 42 వ తత్వం

శ్రీ గురుదేవా నమోనమో । శ్రీ గురునాథ నమోనమో ॥శ్రీ॥

1. సర్వాధారా న............. । నిర్వాణప్రద న......... ॥శ్రీ॥
2. నిజసుఖరూపా న............. । సుజన రక్షకా న............. ॥శ్రీ॥
3. సత్యస్వరూపా న............. । మృత్యుంజయహర న............. ॥శ్రీ॥
4. పావనమూర్తే న............. । భావాతీతా న............. ॥శ్రీ॥
5. వేదస్వరూపా న............. । బోధస్వరూపా న............. ॥శ్రీ॥
6. చిత్సుఖరూపా న............. । సత్యస్వరూపా న............. ॥శ్రీ॥
7. త్రిగుణాతీతా న............. । గగనాకారా న............. ॥శ్రీ॥
8. విశ్వనియామక న............. । విశ్వాతీతా న............. ॥శ్రీ॥
9. సాక్షి స్వరూపా న............. । మోక్షస్వరూపా న............. ॥శ్రీ॥
10. శంభో శంకర న............. । సాంబసదాశివ న............. ॥శ్రీ॥
11. హే పరమాత్మ న............. । హే పరమేశా న............. ॥శ్రీ॥
12. పరాత్పరా శివ న............. । గురుమహదేవా న............. ॥శ్రీ॥
13. జయజయ శంకర న............. । జయ గురుశంకర న............. ॥శ్రీ॥

## 43 వ తత్వం

కాపాడు ।దేవ। కాపాడు ॥ హే పరమాత్మా హేజగదీశా ॥కా॥

1. పాపములెల్లను బాపుచు నీ భవ । తాపమణచి నీ రూపము జూపుచు ॥కా॥

2. దుష్టుల సంగము దొలగించుచు నను । శిష్టుల సంగమ నందున గూర్చుచు ॥కా॥

3. మిథ్యాజగమును సత్యం బనుచును । తత్వము నెరుగక మత్తుడ నైతిని ॥కా॥

4. బొంకుచు వరులను వంచనజేసితి । ఇంకా ఎంతో పాపము జేసితి ॥కా॥

5. లెక్కలేని దోషములను జేసితి । దిక్కులేని పరదేశిని దయతో ॥కా॥

6. ఎక్కడి మోహము ఎక్కడి సుఖమిది ॥ ఎక్కడిదో ఇది ఎందుకు వచ్చెనో ॥కా॥

7. సతిసుతులే నిజసుఖమని నమ్మితి । మతిమాలిన అతిమోహుడ నైతిని ॥కా॥

8. నిన్ను వినా నేనన్యుల నెరుగను । నిన్నే శరణంటిని మన్నింపుచు ॥కా॥

9. నిన్నేశరణన దోషములన్నిటి । మన్నించుచు ముక్తి నొసంగెద నంటివే ॥కా॥

10. శ్రీ గురు శంకరస్వామి సదాశివ । శ్రీ గురు మహాదేవ దేవ శివానంద ॥కా॥

## 44 వ తత్వం

1. విసుగుజెందరాదా । మనసా । విసుగు జెందరాదా ॥ విషయము
సుఖమని మననము జేయుచు । విషమునె పానము జేయుచు
నుందువు ॥వి॥

2. దేహము లెన్నాయె । నీకీ । మోహము లెన్నాయె । దేహమో
హముల లెక్కను నీవిక । వూహించుటకైనను సాధ్యంబే ॥వి॥

3. ఎన్ని తల్లులైరో । నీకిక। ఎన్ని తండ్రులైరో ఎన్ని సతులతో
భోగించితివో । ఎన్ని పిల్లలకు తండ్రివి యైతివో ॥వి॥

4. ఎన్నిమార్లు పుట్టి । నీ విక । ఎన్నిమార్లు గిట్టి । ఎన్నిభుజంబుల నీ
వెక్కితివో । ఎన్ని స్మశానంబుల జొచ్చితివో ॥వి॥

5. తిన్నదె తినుచున్న । నీవిక । విన్నదె వినుచున్న । కన్నదె కన్నను
తిన్నదె తిన్నను । నిన్నీభ్రాంతియు ఎన్నడువదలునో ॥వి॥

6. కన్నులార నీవు । పీనుగ । లెన్నిజూచినావు ॥ ఇన్ని జీవులను జంపిన
కాలుడు । నిన్నిక వదలునే పిచ్చిజీవుడా ॥వి॥

7. ఏల భ్రమించెదవు । నీ విక । యే లాశించెదవు । ఏలాశించెద వేల
ధరించెద । వేల నీవు బలుజాలి చెందెదవు ॥వి॥

8. చిక్కి తపించెదవు ।భవమున । దిక్కులేక నీవు ॥ కుక్కరీతిగా
మృత్యువు వెంబడి । వెక్కి వెక్కి నీ వేడ్చుచుబోదువు ॥వి॥

9. సతి యనునది యేది । నీదను । సుతుడనుటయు యేది ॥మతి
హీనుండై మాంసపు బొమ్మను । సతియని సుతుడని మోహించె దవే ॥వి॥

10. చింతజేసి నీవు । కన్నీరెంత గార్చినావు । ఎంతటి కష్టము లెంతటి దుఃఖము ।
లెంతటి సంకటముల బొందితివే ॥వి॥

11. చిక్కిమాయవలలో । పడితివి । దుఃఖపు నరకములో ॥నిక్క
మెరుంగుము ఇంకైనను నీ । దిక్కు దారిగని సుఖమును బొందుము ॥వి॥

12. అక్కడ కెగిరెదవు మరినీ । విక్కడ దుమికెదవు ॥ ఎక్కడ కెగిరిన
నేమియు జిక్కదు । నిక్కంబిదియని నామాటను విని ॥వి॥

13. నాది యనగనేల । నీవీ । బాధలొందనేల ॥ ఆదియంతములు లేకుండెడు
భవ । బాధల నొందిన మతి రాలేదే ॥వి॥

14. కర్మను నమ్మకుము । నీ నిజ । మర్మము కనుగొనుము ॥ కర్మంబను
బాడుగకీ దేహము । కర్మ తీరితే వుండదు నిముషము ॥వి॥

15. ముక్తి కోరలేదు । పెద్దల । మ్రొక్కి వేడలేదు ॥ భక్తితోడ శ్రీ
గురు మహాదేవుని । నిక్క మెరుంగక ముక్తి లభించదు ॥వి॥

## 45 వ తత్వం

వీడెవ్వడో చూడుమమ్మా । వీడీ । రేడులోకము లేలు ప్రభువగు నమ్మా ॥వీ॥

1. వీడేమియును జేయడమ్మా ।ఐతే। వాడేలేకున్న ఏపనియయు కాదమ్మా ।
ఏడేడ తానుండునమ్మా ।వీడు । గూఢముగానుండు కానరా డమ్మా ॥వీ॥

2. కన్నుల కగుపడడమ్మా । వీడు । చిన్మయుడై సర్వ వ్యాపకుడమ్మా ॥
భిన్నము తా నెఱుగడమ్మా । వీని । కన్నవాడిక జన్మములకు రాడమ్మా ॥వీ॥

3. కనుచుండు కనులు లేవమ్మా । అట్లే । వినుచుండు నతనికి చెవులు లేవమ్మా । తను మధ్యమున నున్నాడమ్మా ।ఈ। తనువు నందున్న ను తను వంటడమ్మా ॥వీ॥

4. సత్య రూపుండు వీడమ్మా ।వీడే। మిథ్యాజగంబున కాధారుడమ్మా । చిత్తమునందున్నాడమ్మా ।ఘోర । మృత్యువు మ్రింగిన ధీరుడే యమ్మా ॥వీ॥

5. సర్వము తా నగునమ్మా । కాని । నిర్వికారుడై సర్వము జూచునమ్మా । గర్వము తా జెందడమ్మా ।నానా। దుర్వివాదములకు తా జిక్క డమ్మా ॥వీ॥

6. ఒక్కడై తానున్నాడమ్మా ।ఐతే। ఒక్కడేయనుచును తా నెంచ డమ్మా । ఒక్క అక్షర రూపుడమ్మా ।తా। నొక్కడైయున్నను సుఖ స్వరూపుడమ్మా ॥వీ॥

7. పరమ పవిత్రుడేయమ్మా ।వీని। నెఱిగినవాడు సర్వము నెరుగునమ్మా । సరి వీని కెవడు లేడమ్మా । వీడే । గురు మహా దేవుడై తా వెల్గునమ్మా ॥వీ॥

## 46 వ తత్వం

1. ఎంతటి ఆశ్చర్యం ।ఇది తన । కెంతటి యజ్ఞానం ॥ ఎంతటి మూఢుం డైనను ఎదురుగ । ముంతను జూచిన అది తాననునే ॥ఎం॥

2. ఎదురుగ జూచినను । తనువును । ఇదియే తా ననును ॥ ఇది యనునది తన కన్యంబై తన । కెదురుగ కనబడు దానిని నేనన ॥ఎం॥

3. మల కాయంబిదిరా ।తా ని। ర్మలుడై యుండునురా ॥ మలమూత్రా స్థల మాంసపు కొంపను । మలరహితుండై దీనిని నేనన ॥ఎం॥

4. జడమై యున్నదిరా । ఇది బహు। యిడుముల పాలగురా ॥ మృడుడై తానీ ఒడలిని పొడగని । విడువక మోహముచే కడుబడలుట ॥ఎం॥

5. పుట్టి వికారమును ।జెందును । గిట్టుచు మన్నగును ॥ పుట్టని గిట్టని దేవుడు తానై । పుట్టి గిట్టు ఈ కాయము నేనన ॥ఎం॥

6. ఎంతటి సాహసమో ॥ మాయకు । ఎంత పరాక్రమమో ॥ ఎంతటి తప

సుల నైనను దేహ। భ్రాంతిని జూపుచు చింతల ముంచును ॥ఎం॥

7. ఉన్నది యనరాదు ।మాయను। లేనిది యనరాదు ॥ ఉన్నది లేదని

వూహకు జిక్కదు। చిన్మయుడై నిల్చిన అది వుండదు ॥ఎం॥

8. హంస రూపుడగురా। తాను ని। రంశరూపుడగురా ॥ కంసలి జేసిన

బొమ్మను శివుడని। సంశయ మొందిన శ్రుతి వాక్యములను ॥ఎం॥

9. జ్ఞానమె తా నగురా। ఎరిగిన। తానే శివుడగురా ॥ తాను గురు

మహాదేవుని చేరక। తానీ తను వని భ్రమచే చచ్చుట. ॥ఎం॥

## 47 వ తత్వం

1. తత్వమసి మహావాక్యార్థంబును మన నించుచు సుఖమొందుమురా।

తత్వమసి మహావాక్యమునకు వాచ్యార్థము లాక్ష్యార్థముగనరా ॥త॥

2. ఆ శివుడే నీవై యున్నావని ఆ పదముల కర్థంబగురా।

ఆ శివుడే నీ వనగా నీకా వాచ్యార్థంబది పొందదురా ॥త॥

3. ఎచ్చట వాచ్యార్థంబది పొందక యుండునో దానిని వదలుమురా।

అచ్చట లక్ష్యార్థంబును గైకొన నిజముగ నీకది పొందునురా ॥త॥

4. జీవుడు దేహము తానని యుండిన వాచ్యార్థంబు విరోధమురా।

జీవుడు తన నిజరూపము నెరిగిన లక్ష్యార్థం బవిరోధమురా ॥త॥

5. త త్పదవాచ్యుండగు ఈశుడు సర్వజ్ఞుడు సర్వేశ్వరుడగురా।

త్వం పద వాచ్యుడు ఈ జీవుడు తా కించిజ్ఞుడు సంసారియురా ॥త॥

6. విద్యా విద్యోపాధి వశంబున విశేషణంబుల భేదమురా।

భేద విశేషణముల వదలి యధిష్టానము నెరుగ నభేదమురా ॥త॥

7. ఉభయ పదంబుల వాచ్యార్థంబును వదలుచు లక్ష్యార్థము గనరా।

శుభలక్ష్యార్థము గైకొని జీవుడే దేవుండనుచును కనుగొనరా ॥త॥

8. తత్పదలక్ష్యార్థమునకు సచ్చిత్సుఖ రూపంబగు బ్రహ్మమురా।

త్వంపద లక్ష్యార్థమునకు జీవుడు తుర్య నిజాత్మ స్వరూపుడురా ॥త॥

9. సత్తు చిత్తు ఆనంద స్వరూపమె బ్రహ్మంబని శ్రుతి పల్కునురా ।
సత్తు చిత్తు ఆనందస్వరూపుడు నీవే కావున బ్రహ్మమురా ॥త॥

10. "అనేన జీవే నాత్మనాను ప్రవిశ్య" యనుచు శ్రుతి పల్కునురా ।
కన దేవేంద్రియ సర్వవిలక్షణ చిన్మాత్రుండే తానగురా ॥త॥

11. భేదవాదు లీ వాక్యమునకు విపరీతార్థము గల్పించెదరు ।
భేదవాదు లీ తత్వము నెరుగక భవనరకంబును బొందెదరు ॥త॥

12. కావున జీవుడె దేవుండని యా "అసి" పదముఖ్యార్థంబగురా ।
నీవీ నిజమును గురు మహాదేవుని కింకరుడగుచు నెరుంగుమురా ॥త॥

## 48 వ తత్వం

1. ద్వైతంబును నిందించును శ్రుతి అద్వైతంబును స్తుతి యించునురా
ద్వైతాద్వైతంబుల నిర్ణయమునశ్రుతియే ప్రబల ప్రమాణమురా ॥ద్వై॥

2. "నాత్రకాచన భిదాస్తి" యనుచు వేదము భేదంబును ఖండి చు ।
"అత్రభిదామివ" యను శ్రుతి భేదము నతినీచముగా నిందించు ॥ద్వై॥

3. "ద్వితీయాద్వై భయంభవతి" యనిభేదంబును దూషించునురా ।
సత్యము భేదము నెంచిన వానికి జన్మపరంపర తొలగదురా ॥ద్వై॥

4. దేహముతానని ఎరిగిన వానికి జగము సత్యమై యగుబడురా ।
దేహము తాకాదని తననిజమును ఎరిగిన జగమే యుండదురా ॥ద్వై॥

5. దేహీదేహము తానను మాటెన్నటికైనను సత్యముకాదు ।
దేహము వదలుచు తనుదానెరిగిన రెండవదను వస్తువులేదు ॥ద్వై॥

6. చిత్తంబుండిన కనుబడు జగమిది చిత్తము లేకుంటే లేదు ।
చిత్తము సుప్తిలో లయమైనప్పుడు ద్వైతంబను శబ్దము లేదు । ॥ద్వై॥

7. ఉండిన అదిలేకుండదు అదిలేకుండిన నిజముగ వుండదురా।
ఉండెడు లేకుండెడు భావంబును తత్త్వజ్ఞులు పొడగనెదరురా ॥ద్వై॥

8. "ద్వైతంమాయా మాత్రమిదం అద్వైతం పరమార్థం" బనురా ।

"జ్ఞాతేద్వైతంన విద్యతే " యనిశ్రుతులెల్లను ఘోషించునురా ॥ద్వై॥

9. దేవుండన్యుండని భజియించినవాడిక తత్వంబెరుగడురా ।
జీవుండా దేవుని శరణంబని పశువును పోలిన బంటగురా ॥ద్వై॥

10. "తత్వమసి" మహావాక్యము నీవే దేవుండని బోధించునురా ।
శ్రుతి "ప్రజ్ఞానం బ్రహ్మ" యనుచు "అయమాత్మా బ్రహ్మ" ముసు గనరా ॥ద్వై॥

11. వంధ్యాపుత్రునిచే భయమొందిన ఈజగమది సత్యంబగురా ।
గంధర్వుని నగరము నిజమైతే అప్పుడు జగమిది సత్యమురా ॥ద్వై॥

12. కుందేలిక తనకొమ్మున ఏనుగు జంపెను యన నిది సత్యమురా ।
పిండినపాలా మఱిగోస్తనమును జేరిన జగమిది సత్యమురా ॥ద్వై॥

13. మృగతృష్ణాజలమును త్రాగుచు తృప్తినిబొందిన ఇది సత్యమురా ।
గగనంబున ఆ నీలవర్ణమిక వుండిన జగమిది సత్యమురా ॥ద్వై॥

14. జలజము పావక మండలమున వృద్ధిని బొందిన యిది సత్యమురా
నెలకుముందరుగా చచ్చిన మనుజుడు వచ్చిన జగమిది సత్యమురా ॥ద్వై॥

15. "జ్ఞానాదేవతుకైవల్యం" బని ఆ శ్రుతి మొరలిడుచున్నదిరా ।
జ్ఞానమే నీనిజ రూపంబని గురు మహాదేవుడే నేననరా ॥ద్వై॥

## 49 వ తత్వం

1. హరుని ఎరుంగక నేమిఫలం । నిజ । మెరుగక బ్రతికిన నేమిఫలం।
నరుడై నను తా తనమరణంబును । పరిహరించక నె ఏమిఫలం ॥హ॥

2. వేదము చదివిన నేమిఫలం । ఈ । భేదము వదలక నేమిఫలం । బోధ
రూపుడై నిలువక ఒడలికి । బూదిని పూసిన నేమిఫలం ॥హ॥

3. ఊళ్లకు తిరిగిన నేమిఫలం । ఆ । గుళ్లను చుట్టిన నేమిఫలం । ఏళ్లకు
తిరుగుచు నీళ్లనుమునుగుచు । రాళ్లకు మ్రొక్కిన నేమిఫలం ॥హ॥

4. చెట్టును చుట్టిన నేమిఫలం । ఆ । పిట్టల మ్రొక్కిన నేమిఫలం ।
పుట్టుట గిట్టుటలను బోగొట్టక । ఎట్లుండిన తన కేమిఫలం ॥హ॥

5. కాశివాసమున నేమిఫలం । వుప॥ వాసము జేసిన నేమిఫలం ।
నాశ రహిత జగదీశు నెరుంగక । దేశము తిరిగిన నేమిఫలం ॥హ॥

6. చర్మము కడిగిన నేమిఫలం । ఈ । కర్మలజేసిన నేమిఫలం ।
బురద బురదచే కడిగిన పోవునే । మర్మము నెరుగక నేమిఫలం ॥హ॥

7. ఆశలమానక యేమిఫల । తా । వేషము వేసిన నేమిఫలం ।
మోసము చేసిరి సంపాదించుచు । మీసముత్రిప్పిన నేమిఫలం । ॥హ॥

8. విద్యలనేర్చిన నేమిఫలం ।బహు॥ బుద్ధిమంతుడై యేమిఫలం ।
శుద్ధ జ్ఞానము నెరుగక ఈ భవ । బద్ధుండై తన కేమిఫలం ॥హ॥

9. భక్తిలేక నీకేమిఫలం ।నిజ॥ ముక్తినిజెందక యేమిఫలం ।
తత్వార్థంబు నెరుంగక కర్కశ । తర్కముజేసిన నేమిఫలం ॥హ॥

10. ధ్యానము జేసిన నేమిఫలం । అభి॥ మానము వదలక యేమిఫలం ।
నానాత్వంబును మానక తనలో తానాశివుడన నేమిఫలం ॥హ॥

11. ధీరుడు తానన నేమిఫలం । ఆ । చారపరుండై యేమిఫలం ।
పారరహిత శ్రీగురు మహాదేవుని । జేరక నరుడై యేమిఫలం ॥హ॥

## 50 వ తత్వం

ధన్యాసి రాగం

ఆదితాళం

1. జ్ఞానముచే అజ్ఞానము పోవును కర్మలచే నశియించదురా ।
జ్ఞానస్వరూపము నెఱుగక తర్కములాడిన ముక్తిలభించదురా ॥జ్ఞా॥

2. మరపే మరపున కాశ్రయమగునే మరపున కాశ్రయ మెరుకగురా ।
ఎరుకలోన మరపుండదు కానీ ఎరుకనెరుగ మరపుండదురా ॥జ్ఞా॥

3. మరపు అనాదిగయున్నను నిజతత్వం బెరిగిన నాశంబగురా ।
ఎరుగుము చీకటి అనాదియైనను వెలుగుచేత నాశంబగురా ॥జ్ఞా॥

4. రవిచే కల్గిన ఆ మేఘము లా రవిని యావరించును గనరా ।

రవినే మూయుచు రవిచే వెల్గును రవిచే నాశంబొందునురా ॥జ్ఞా॥

5. స్వానుభూతి లేకా పరబ్రహ్మము తానన తనకగు ఫలమేమి ।
తానా శాభాగ్రమునందలి ఫలముల నీటను గన ఫలమేమి ॥జ్ఞా॥

6. అద్దములో తన కగుబడు ఆ ధనరాశిని తనదన ఫలమేమి ।
బుద్ధిబలంబున శాస్త్రముజూచుచు బ్రహ్మము తానన ఫలమేమి ॥జ్ఞా॥

7. స్వానుభవంబున శుద్ధజ్ఞానము తానని దృఢముగ నిలవలెరా ।
తానీ దేహము నేనను భావము బొత్తిగ మానుచు నిలవలెరా ॥జ్ఞా॥

8. ఎంత దృఢముగా తా నీ దేమంబనునది యున్నదొ చూడుమురా ।
అంత దృఢముగా జ్ఞానమె నేనని యుండిన నిజముక్తుండగురా ॥జ్ఞా॥

9. జ్ఞానమె నేనని దృఢముగ నిలిచే వరకును మననము మానకురా।
మానసము మననము దృఢమైతే నిధిధ్యాసమదినిలుచును రా । ॥జ్ఞా॥

10. నిధిధ్యాసమది దృఢముగ నిల్చిన సహజసమాధియు కల్గునురా ।
అదియేనిజముగ పరమపదంబగు నాతడె జీవన్ముక్తుడురా ॥జ్ఞా॥

11. బ్రహ్మముతానని వట్టిమాటలను చెప్పకొన్న ఫలముండదురా ।
నెమ్మదిబొందుచు బోధరూపగురు మహాదేవుడై నిలవలెరా ॥జ్ఞా॥

## 51 వ తత్వం

దూరమేమిరా । ముక్తి । దూరమేమిరా । పారమార్థ జ్ఞానమందు దూరి నిల్చినట్టి
యతికి ॥దూ॥

1. సారరహిత ఘోరసం।సార విషయముల నరికి। పారరహిత పూర్ణుడైన ।
ధీర గంభీర యతికి ॥దూ॥

2. దేహమందు ।ఆత్మబుద్ధి। మోహమెల్ల తాను గాల్చి । సోహమర్థ
మెరిగి శుద్ధ । బ్రహ్మరూపుడైన యతికి ॥దూ॥

3. ప్రాణధీంద్రియములనెల్ల । మాని దృశ్యమనుచు తాను
మానసంబునందు వెలుగు జ్ఞానరూపుడైన యతికి ॥దూ॥

4. భీతినెరుగకుండ విషయ । ప్రీతి కత్తరించి ఘోర । మృత్యుభీతి మీరి

అస్తి । భాతి ప్రీతి రూపయతికి ॥దూ॥

5. సర్వవిషయములను ఎరుగ । సర్వసాక్షి యనుచు తాను ।

నిర్వికార నిర్వికల్ప । నిర్మలాత్మరూప యతికి ॥దూ॥

6. లోకమెల్ల తానటంచు । లోకనాధు డగుచు జాగ ।

రూకుడై వివేకియగుచు । నేకరూపుడైన యతికి ॥దూ॥

7. చర్మదేహ భ్రాంతి వదలి । కర్మమార్గమెల్ల మీరి ।

మర్మ మెరిగి తాను నిత్య । నిర్మలాత్ముడైన యతికి ॥దూ॥

8. జీవభావమెల్లవదలి ।యేవికారములును లేక ।

భావములను మీరి వెలుగు । దేవుడైన జాణ యతికి ॥దూ॥

9. భేద భావములను మాని । సాధనలను మాని సహజ ।

బోధరూపు డగుచు నిజ స। మాధియందుండు యతికి ॥దూ॥

10. ఖ్యాతితోడ తాను యెల్ల । జాతి తనువులందు నిండు।

చేతనంబెతాను యనెడి । రీరి నెరిగినట్టి యతికి ॥దూ॥

11. ఎఱుక మరపు నెరుగు శుద్ధ । ఎరుక రూపుడైన పరమ ।

గురుమహా దేవుడగుచు । మెరయచుండు ధీర యతికి ॥దూ॥

## 52 వ తత్వం

జయ గురుదేవ । జయ మహాదేవ ।

1. ఎన్ని జన్మముల నే జేసిన యా । పుణ్యఫలమెల్ల ఫలియించి నన్నిక ।

చిన్మయుడని బోధించుచు కృపతో । ధన్యుని జేసిన సద్గురునాధా ।జ।

2. బ్రహ్మజ్ఞానముచచే మోక్షంబని । బ్రహ్మము కేవల అపరోక్షంబని।

బ్రహ్మముకావున వేద్యముకాదని । బ్రహ్మమె నేనని తెలిపిన దేవా ।జ।

3. తత్వమసి మహావాక్యార్థంబున । పీృతితోడ బోధించుచు నా కా।

మృత్యుభీతి నిర్మూలము జేయుచు । మృత్యుంజయునిగజేసిన దేవా ।జ।

4. తొమ్మిదిద్వారంబులు గల పురిని అ । హ మ్మతి వదలుచు జ్ఞానమె
నేనని । నెమ్మదిబొందిన పరమపదంబని । బొమ్మనిజంబునుజూపినదేవా ।జ।

5. సంచిత ప్రారబ్ధాగామున తా ।మించిన సచ్చిత్సుఖ రూపుండని।
పంచకోశవిలక్షణ సాక్షిని వంచనసేయక జూపిన దేవా ।జ।

6. పాతకుడని నే తాపము జెందుచు । భీతిని జెందిన నాకీ వరత । త్వా
ర్థము దెలుపుచు నీ పాపిని పర । మాత్మగ జేసిన సద్గురు నాధా ।జ।

7. భానుని సోముని వెలిగించిన యా । జ్ఞానమె పరిపూర్ణ బ్రహ్మంబని ।
జ్ఞానస్వరూపము బోధించుచు నీ । దీనుని గాచిన గురు మహా దేవ ।జ।

## 53 వ తత్వం

కామాజ్ రాగం

ఆదితాళం

1. ఎరుకేగదా । ఉన్న । దెరుకేగదా । ఎరుగుచు సర్వము తన్నెరుగుచు నున్న ।ఎరు।

2. జాగరమున విషయములను ధీంద్రియ । యోగముచే విశ్వుడై ఎరుగుచున్న ।దెరుకే।

3. కలలో మనసనుకర్ణము చేతనే । కలను వెల్గించుచు తైజసు డనబడు ।దెరుకే।

4. వరసుప్తిని సుఖమును యజ్ఞానము । నెరుగుచు ప్రాజ్ఞుడై మాయా వృత్తితో ।ఎరుకే।

5. ఎరుక మరపులను ఎరిగెడు ఎరుకై । తుర్యమునందున సాక్షిగ చున్నది ।ఎరుకే।

6. ఏమియు లేదని లేదనుటను మాని । భూమానంద స్వరూపుడగు చున్న ।దెరుకే।

7. ఎరుకే శ్రీ గురు మహాదేవుడై । స్థిరముగ నిర్మల సుఖముగ నున్నది ।ఎరుకే।

## 54 వ తత్వం

1. ఎవ్వనిచే జగమిది నిర్మాణంబాయెనొ అతడే పరబ్రహ్మ ।
ఎవ్వని యందిది యుండుచు లీనంబొందునొ అతడే పరబ్రహ్మ ।ఎ।

2. సృష్టికి పూర్వము నందొకడే యుండెను సద్రూపుండై బ్రహ్మ ।

ఈక్షించుచు తనకన్యము లేరని బహురూపుండాయెను బ్రహ్మ ।ఏ।

3. పంచభూత ప్రపంచ రూపమే తానాయెను ఆ పరబ్రహ్మ ।

ఎంచిచూడ నీ సర్వ దృశ్యంబున కధిష్టానము పరబ్రహ్మ ।ఏ।

4. అజ హరిరుద్ర సదాశివ రూపము లెల్లను ధరియించెను బ్రహ్మ ।

నిజముగ కనుబడు ఈ జగమున కాధారంబే ఆ పరబ్రహ్మ ।ఏ।

5. సురుడాయెను తా నసురుండాయెను నరుడాయెను పామరుడాయె ।

మరచుచు తను దా నానాయోనుల తిరుగుచు బహు రూపుండాయె ।ఏ।

6. ఎటులీ మనసిది చెడకనె, కలలో రూపాంతరమును తాజెందు ।

అటులా బ్రహ్మము యే హానియు లేకనె జగదాకారముజెందు ।ఏ।

7. బ్రహ్మమె తన మాయాశక్తి వుపాధిని సర్వేశ్వరు డనబడును ।

బ్రహ్మ అవిద్యోపాధి వశంబున తానే జీవుండనబడును ।ఏ।

8. వేదము దేహము దేవాలయమను జీవుడు దేవుండను కనరా ।

బోధరూపుడై దేహమునందుండెడు చేతనమే దేవుడురా ।ఏ।

9. జీవుడు పుణ్యవశంబున గురువును జేరుచు తత్వము గనవలెరా ।

జీవుడు తన నిజతత్వం బెరిగిన తానె గురు మహాదేవుడురా ।ఏ।

## 55 వ తత్వం

1. ఆనందము । సహ । జానందము ॥

నానాత్వమును తా మానుచు నిల్చిన ।ఆ।

2. హితమగు విషయము తనకు లభించిన । హితమగు చుండగ ఆ సుఖ

మది విషయానంద ।ఆ।

3. నిద్రయందు సర్వము లీనంబై । నిద్రలోనగల ఆ మది బ్రహ్మ ।ఆ।

4. మును పనుభవమున పొందిన సుఖమది । మనసుకువచ్చిన ఆసుఖ

మది వాస । నానంద ।

5. తనలో సుఖదుఃఖములను జెందక । మనసున తోచెడు ఆ సుఖ

మది ము । ఖ్యానంద ।

6. భోగపు బుద్ధిని వదలుచు నిజ వై । రాగ్యముచే తనకగు సుఖ

మదియే ।నిజానంద।

7. అన్నిటి కంటెను ఆత్మయే సుఖమని । చిన్మయుడై నిల్వ, ఆ సుఖ

మది ఆ । త్మానంద

8. బాహ్యాభ్యంతరముల మరచుచు పర । బ్రహ్మమె తానై నిల్చిన

అద్వై ।తానంద।

9. తత్వమసి మహావాక్యము నందలి । తత్వము విని కల్గిన సుఖ

మది వి । ద్యానంద ।

10. పరమ భక్తితో గురుమహాదేవుని । చరణము లందైక్యము

నొందిన సహ । జానంద

## 56 వ తత్వం

ఏమి సుఖం । ఇది । ఏమి సుఖం । ఓ మనసా ఈ మనుజ శరీరం ।ఏ।

1. చీము రక్తము మాంస మమేధ్యము మూత్రభాడ మిదియనికనరా

వ్యామోహముచే సతియని సుతుడని నమ్ముచు నరకము

జెందకురా ।ఏ।

2. మనుజుండు సురాపానము జేసిన తన బుద్ధియు చెడుచుండునురా ।

వనితయను సురావాసన మనసుకు తగిలినచాలును మతిచెడురా ।ఏ।

3. రావణుండు తన వంశముతోడ నశించెను సీతను మోహించి

దేవేంద్రుడు సహస్రాక్షుండాయెను తాను అహల్యను మోహించి ।ఏ।

4. తను విది స్థిరమా ధనమిది సుఖమా । వనిత సుఖంబిది నిజసుఖమా

తనయులు సుఖమా ధ్యానము సుఖమా మేడలు సుఖమా

సొమ్ములు సుఖమా ।ఏ।

5. జననము కష్టం బాల్యము కష్టం యౌవన మోహంబతి కష్టం ।

తను వార్థక్యము జెందిన కష్టం కాలుని భయమో అతి కష్టం ।ఏ।

6. తనయులు మూఢులు ఐతే దుఃఖం సతి జారిణి ఐతే పెనుదుఃఖం । ధన

మది వచ్చిన చాలని దుఃఖం ధనమది దొంగిలి పోయిన దుఃఖం ।ఏ।

7. చోరభయం దారిద్ర్యభయం శతృవుల భయం బీరోగభయం । దార

సుతాదుల గతియేమోయని అనవరతముభయం మరణభయం ।ఏ।

8. ఇట్టీ జీవితమిది బహు సుఖమని కాలము వ్యర్థము పుచ్చకురా ।

ఎట్లు ముక్తినే పొందగలను యని ఇంకైనను చింతించుమురా ।ఏ।

9. వైరాగ్యంబును దయ పాలించుము యని పరమాత్మని వేడుమురా ।

ధీరుడగుచు శ్రీ గురు మహాదేవుని కింకరుడై నిజమెరుగుమురా ।ఏ।

## 57 వ తత్వం

1. మనసును జూడగ బహుచిత్రము అది కనబడకనె మాయంబగురా ।

మనసే బుద్ధియు మనసే చిత్తము మనసే అహమని ఎరుగుమురా ॥మ॥

2. సంకల్ప వికల్పంబుల జేయుచు ఇది మనస నబడుచుండునురా ।

సంకల్పంబున నిశ్చయించి ఇది బుద్ధి యనంబడు నెరుగుమురా ॥మ॥

3. చిత్త మనంబడు ధారణచేయుచు అభిమానించుచు అహమగురా ।

తత్వము నెరిగిన మనస వ్యక్తము పూసర వెల్లిని బోలునురా ॥మ॥

4. ఉన్నది యదియని చూచెదమంటె లేకనెపోవుచు నుండునురా।

తిన్నగ లేదని చెప్పిన వెంబడె ఇదిగో నేనను చుండునురా ॥మ॥

5. భిన్నముగా బహునామ రూపముల బొందుచు నది దృశ్యంబగురా ।

భిన్నము నాకదియవ అభిన్నమైనీలో లయమగు చుండునురా ॥మ॥

6. మనసిది జడమన చేతనమై తోచును చేతనమన జడమగురా ।

మనసు జడంబగు నాత్మదృష్టిచే విషయమెరిగి చేతనమగురా ॥మ॥

7. జడమగు మనసిది ఎరుగుటెట్లయని నీవిక సంశయ మొందకురా ।

పొడగ నయస్కాంతము జెందిన సూదిని పొందిన సూదిచలించునురా ॥మ॥

8. అన్యానన్యేతరమై సదసద్విలక్షణంబై యున్నదిరా।
ఎన్నివిధంబులజూచిన అది మిధ్యాభూతంబై యున్నదిరా ॥మ॥

9. కామము సంసారము సర్వంబును ఈమనసుననే యుండునురా।
ఈమనసుండక యేమియునుండదు జగమెల్లను ఈ మనసగురా ॥మ॥

10. మనసిది శుద్ధాశుద్ధంబనుచును రెండు విధములై యుండునురా।
మనసిది కామముచేత అశుద్ధము కామరహితమై శుద్ధమురా ॥మ॥

11. మనసు, మాయ, ఆవరణ, విక్షేపము, ప్రకృతి, అజ్ఞానంబననొకటే,
మనసు, జీవుడా సూక్ష్మశరీరము, లింగ థరీరంబన నొకటే ॥మ॥

12. జీవునికిం గల బంధమోక్షముల కీ మనసే కారణమగురా।
వేవిధ విషయాసక్తియె బంధము నిర్విషయంబే మోక్షమురా ॥మ॥

13. మనసులయించిన జగములయించును, జగములయించిన నిజమదిరా।
చిన్మయ శ్రీ గురుమహాదేవుని కృపచే నీవీ నిజమెరుగుమురా ॥మ॥

## 58 వ తత్వం

1. ఈశ్వరుడే ఈ జగమును సృష్టించెను యనుచును నీ వెరుగుమురా ॥
ఈశ్వరుడే జగమును సృష్టించిన జగమిది మిధ్యాభూతమురా ॥ఈ॥

2. బ్రహ్మము తన చిచ్ఛక్తియె ప్రకృతియనంబడు ప్రకృతియె జగ
మాయె। బ్రహ్మమె మాయోపాధిచేత ఈశ్వరుడై తానీ జగ మాయె ॥ఈ॥

3. లోకమునందున ఏకార్యమునకు మూడు కారణములుండునురా ॥
లోకేశ్వరుడీ సృష్టికి పూర్వము నొకడే తానైయుండెనురా ॥ఈ॥

4. కుండకు కుమ్మరి నిమిత్తకారణ, ముపాదాన మా మన్నగురా।
దండచక్రములు కుమ్మరికా సహకారి కారణంబని కనరా ॥ఈ॥

5. లోకేశ్వరుడీ సృష్టికి తాను నిమిత్త కారణంబగు గనరా।
లోకేశుని తన మాయాశక్తి వుపాదానంబని ఎరుగుమురా ॥ఈ॥

6. శక్తుని శక్తియు శక్తుని కంటెను భిన్నము కాదని యెఱుగుమురా

శక్తియు కార్యంబై వ్యక్తంబై తుదకాశక్తుని జేరునురా। ॥ఈ॥

7. కావున పరమేశ్వరుడే ఈ జగదాకారంబున వెల్గునురా।
దేవుడు కావున సృష్టి కభిన్న నిమిత్తో పాదానంబగురా ॥ఈ॥

8. నీ కలలో నీ వేదియు లేకనె జగదాకారము బొందెదవు।
లోకేశ్వరుడీ జగమాయెను యన ఏలా సంశయ మొందెదవు ॥ఈ॥

9. అంతా బ్రహ్మమయం బనుచును యావేదంబు లుద్ఘోషించునురా।
సంతసమొందుచు సంశయమొందక తత్వార్థంబిదియని కనరా ॥ఈ॥

10. నామరూపముల నగుబడు ఈ జగమిది మిధ్యాభూతంబగురా।
నామరూపముల కధిష్టాననుగు నా చేతనమే సత్యమురా ॥ఈ॥

11. చేత మనునది ఒక్కటెకానీ రెండెంద్దైనను కలదేరా।
చేతన మెంద్దైనను భిన్నంబై రెండగునే యోచించుమురా ॥ఈ॥

12. జీవుడు వేరే దేవుడు వేరను సంశయమును తెగనరకుమురా।
దేవుడు వేఱని యెంచినవాడిక తప్పక నరకము జెందునురా ॥ఈ॥

13. బహుశ్రుతులెల్లను బ్రహ్మంబొక్కటె సత్యంబని బోధించునురా।
బ్రహ్మమె జీవుడు వాడెగురు మహాదేవు డనుచు నీ వెరుగు మురా ॥ఈ॥

## 59 వ తత్వం

1. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" యని బోధించును యా వేదంబు ॥
బ్రహ్మము నెఱిగిన వానికి తప్పక కొనముట్టును ఈ జన్మంబు ॥బ్ర॥

2. బ్రహ్మము ప్రత్యక్షము గాదుర పరబ్రహ్మము అపరోక్షంబగురా।
బ్రహ్మము అపరోక్షంబన స్వానుభవంబున తాననెనొకటేరా ॥బ్ర॥

3. ఇంద్రియములకెది గోచరమగునో అది ప్రత్యక్షంబనబడురా।
ఇంద్రియములకు నగోచరమై అది ఎందోవున్న పరోక్షమురా ॥బ్ర॥

4. ప్రత్యక్ష పరోక్షముల విలక్షణమైనది అపరోక్షంబగురా।
సత్యము అనుభవ మపరోక్షంబన సాక్షాత్కారము నొకటేరా ॥బ్ర॥

5. ఇది కాదిది కాదనుచును దృశ్యము వదలిన తానే మిగులును రా ।
వదలగ నన్నిటి మిగిలిన దదియే తానిదియే అపరోక్షమురా ॥బ్ర॥

6. శోధించిన తను తా నెప్పుడు నుండుచు సద్రూపుండగు చుండు ।
బోధరూపుడై వెలుగుచు వెలిగించుచు తా నిజసుఖ రూపుండు ॥బ్ర॥

7. సత్తు చిత్తు ఆనందరూపమే బ్రహ్మంబను యా వేదంబు ।
నిత్యుడు పూర్ణుడు గురుమహాదేవుడు తానే ఇది నిజతత్వంబు ॥బ్ర॥

## 60 వ తత్వం

1. నేను నేనన తగునా । మలకాయమును నీవు । నేను నేనన తగునా ॥
జ్ఞాన స్వరూపుడై, సర్వము నెరుగుచు । ప్రాణము పోయిన పీనుగ ఇది దీని ॥నే॥

2. నే నెవ్వడని చూడుమా, తనువును వదలుచు । నీ నిజమును కను
గొనుమా । నేనెవ్వడని చూడ, కానరాదేమియు, జ్ఞానరూపుండగు సాక్షియు నీవై ॥నే॥

3. పురుషుడు నేననుచుండు । జాగరమందు । తరుణియు నేననుచుండు ।
మఱచి నిద్రించిన పురుషుడు తరుణియు నెఱుగరేమియు వా, రెఱుక
రూపుండై ॥నే॥

4. దేవా ! రక్షించుమనెదవు । అంతేకాని । దేవుని నిజము నెఱుగవు ।
దేవుని నిజమెఱుగను నీవు గురుమహా । దేవుని జేరుము నరుడు
కాదనుము ॥నే॥

## 61 వ తత్వం

మంగళంజయ, జయమంగళం । శుభ । మంగళం శ్రీ గురుదేవునకు ॥మం॥

1. నేనీ దేహముకాదు దేహవిలక్షణ । జ్ఞానస్వరూపుడె నేననుచు । మాని
న దేహాభిమానము నెల్లను । నేనే శివుండని జూపిన గురునకు ॥మం॥

2. ప్రాణములైదును పది ఇంద్రియములును । నే నెరుగుదు, నవి నన్నె

రుగ వనుచు । మానస ధీ వృత్తులను జూచుసాక్షియే । నేనని మర్మము
జూపిన గురునకు ॥మం॥

3. విశ్వ, తైజన ప్రాజ్ఞ నామరూపుండె ఈ । దృశ్యవిలక్షణ సాక్షి
నేననుచు । పాశములెల్లను ద్రుంచి నేనీ పంచ । కోశాతీతుండని
జూపిన గురునకు. ॥మం॥

4. జగమందు నేనని జగమిదినాయందు । తగనుండునని మర్మమును
జూపుచు । జగమిది నాయందు లేదని జూపించి । జగదాధారుని
జూపి బ్రోచిన గురునకు ॥మం॥

5. ఎన్ని విధంబుల నెన్ని జన్మంబుల । నెన్ని తపంబుల నాచరించితివో
అన్ని ఫలించెను గురుమహాదేవుడై । నన్ను బోధించిన శ్రీ సద్గురునకు ॥మం॥

శ్లో॥ మంగళం దేశికేంద్రాయ । నిర్గుణాయ మహాత్మనే
మంగళం దేవ దేవాయ । మహాదేవాయ మంగళం ॥

ఓం తత్సత్

ఇతి శ్రీ మదఖండ సచ్చిదానంద నిత్య నిర్మల నిరాకార నిరామయ నిర్గుణ
పరబ్రహ్మ స్వరూపుండగు
శ్రీమన్మహాదేవ సద్గురుస్వామి కృపాకటాక్ష వీక్షణములచే
వే॥బ్ర॥శ్రీ వేదాంత సుబ్బయ్యశాస్త్రి విరచితనిజానుభవ ప్రకాశ
శ్రీ గురుదేవానంద పద్ధతి
సంపూర్ణం.